# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 2 రాజమహేంద్రవరము 1-7-1979 సంచికలు 16, 17


## —* ఈ సంచికలో *—


1. వేములవాడ భీమకవి పూర్వాశ్రమంలో మల్లియ రేచనా!
2. శాకుంతలోత్తర రామచరితములు.
3. స్త్రీల పాటలలో అప్పగింతలు.
4. ఆవేదన. (పద్య)
5. కవిత్వంలో నవత్వం.
6. మధ్యమాంబా గరీయసీ.
7. సాహిత్యము – సమకాలీన – ఇతివృత్తము.
8. గ్రంథసమాలోచన – విమర్శ వేదిక.
9. మాతృవందనము. (పద్య)


16—7—79 సంచికలో మార్గపద్ధతి – ఆధునిక రచయితలు, నవలా సాహిత్యము – శ్రీమతి రంగనాయకమ్మ, ఆనంద గజపతి – సమస్యా పూరణము మొదలగునవి ఉంటాయి.


—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.

# వేములవాడ భీమకవి పూర్వాశ్రమంలో మల్లియరేచనా!

— శ్రీ చింతలపూడి వెంకటేశ్వర



తెలుగు భాషలో మొట్టమొదటిలక్ష్య గ్రంథం కవిత్రయ కృత ఆంధ్ర మహాభారత మని పలువురి అభిప్రాయం తెలుగున మొదటి లక్షణ గ్రంథ మనబడుచున్న కవిజనాశ్రయం భారత రచనకు తరువాతిదే అయితే పై అభిప్రాయానికి తల వంచవలసినదే.

కవిత్రయమున మొదటి కవి 'ఆది కవి' అనబడుతున్న నన్నయభట్టారకులు. క్రీ శ. 1051 తరువాత భారత రచన ప్రారంభించారు వీరికిముందే తెలుగులో కనీసం పది ఛందో భేదాలు తెలుగుదేశంలో ప్రచారంలో ఉన్నాయి ఆయన శబ్దశాసన బిరుదము తెలుగు శబ్దాల కొక వ్యవస్థ నేర్పరచినందున వచ్చినది కాదు. భారత రచనకు ముందే వారి కా విపుల శబ్ద శాసన బిరుద ముంది. నన్నయ గారికి ముందే తెలుగులో అనేక కావ్యములు రచింప బడి ఉండవచ్చు.

'తెలుగు దేశమున నన్నయకు ముందు జైనులచేత కొన్ని గ్రంథములు వ్రాయబడినవి. జైనమతంతోపాటు ఆ మతస్థులు చెప్పిన గ్రంథములుకూడ నాశనముచేయబడినవి. వాటి పహాను సంపత్తులు లేనిదే నన్నయ ఒక్కసారే అంతటి మహాకవి అయి ఉండేవాడు కాడు' అని అంటారు. జి. వి సీతాపతి గారు.

ఇంతెందుకు? కవిత్రయంలో ఒకడైన ఎఱ్ఱన స్వయంగా తన నృసింహపురాణావతారికలో నన్నయకు ముందుగల సాహిత్యాన్ని గురించిచర్చించాడు

కనుక నన్నయకు ముందు తెలుగులో కావ్య రచన జరిగే ఉంటుందనడంలో సందేహానికి తావులేదు కుమార సంభవ కర్త నన్నెచోడుడు నన్నయకు సమకాలికు డని నిర్ణయించారు కదా! ఇంకా ముందు వాడే అని మానవల్లి రామకృష్ణ కవ్యాగుల అభిప్రాయంకూడా వుంది

అందుచేత మహాభారత రచనకు ముందే తెలుగులో లక్షణగ్రంథ రచన జరగడానికి అవకాశం లేకపోలేదు కవిజనాశ్రయంలో అందుకు కొన్ని ఆధారాలుకూడ కనిపిస్తున్నాయి.

ఆంధ్ర మహాభారతం చంపువులో వ్రాయబడగా కవిజనాశ్రయ కర్త తన కావ్య విభాగంలో చంపువు పేరెత్తలేదు

'హృద్యాన వద్య కావ్యము
గద్యము పద్య మని చెప్పఁగా ద్వివిధ
మగున్.'

'ప్రాణసమాన మిత్రుడు' సహాయుడు కాగా కవి జనాశ్రయమును రచించినట్లు గ్రంథాదిని సంజ్ఞాధికారంలో రచయిత చెప్పుకున్నాడు.

'అసమాన దాన రవితన
య సమానోన్నతుఁడు వాచకా
భరణుడు ప్రా
ణసమాన మిత్రుఁ డీ కృతి
కి సహాయుఁడుగా నుదాత్తకీర్తి ప్రీతిన్'

ఈ ప్రాణసమాన మిత్రు డెవరా అని పలువురు పలువిధాలుగా ఊహించారు వేంగీ చాళుక్యులలో దావార్ణవుడనే రాజే ఈ ప్రాణ సమానమిత్రు డని దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగా రన్నారు. కాకతీయ ప్రతాపరుద్రుని కాలమున వర్ధమానపురము నేలిన భీమరాజు తమ్ముడైన గోకర్ణుడే యీప్రాణసమానమిత్రు డని, అతడు దీనిని రచించి కల్యాణ పురాధీశ్వరుడైన జగదేక మల్లుని సేనాపతియగు రేచభూపాలున కంకితము చేసెనని చిలుకూరి వీరభద్రరావుగారి అభిప్రాయాలెన్నో ఉన్నాయి.

ప్రాణసమాన మిత్రుడైన వా డన్నిటా సమఉజ్జీ అయిఉండా లని నా అభిప్రాయం మల్లియరేచనతో పోల్చిచూస్తే అటువంటివాడుగా కన్నడలక్షణ గ్రంథకర్త మొదటి నాగవర్మ (క్రీ శ. 984) కనిపిస్తున్నాడు రేచన కవిజనాశ్రయాన్ని వ్రాస్తే నాగవర్మ ఛందోంబుధి వ్రాసాడు. ఈ రెండు లక్షణగ్రంథాల నొకచోట పెడితే ఎన్నో సామ్యాలు కనిపిస్తాయి రేచన నాగవర్మ లిద్దరూ జైనులే ప్రాంతభేదమనుకుందామా నాగవర్మ వేంగీమండలాన్నుంచి వెళ్ళినవాడే. ఒకరు 'కవిజనాశ్రయుడు' కాగా మరొకరు 'కవిరాజహంస' ఒకరు 'సుందర తరుణీ స్మర నిభుడు'కాగా, మరొకరు 'కంద కందర్పుడు'. ఇరువురూ మహాయోధులే. ఒకరు తేజమున సమరేంద్ర సుతుడు, మరొకరు యుద్ధభూమిలో అర్జునుని వంటివాడు. రేచన చెప్పుకున్న ప్రాణసమాన మిత్రుడు' అసమానదాన రవి తనయ సమానోన్నతుడుకాగా నాగవర్మయు దానమున కర్ణునంతటి వాడే రేచనయు సంతృప్తాతిథి. అశ్రాంత త్యాగాన్వితుఁడు. రేచన తన గ్రంథమంతటా తన భార్యను చెప్పుకొంటే నాగవర్మ తన భార్య పేరనే తన గ్రంథాన్ని చెప్పుకున్నాఁడు ఇద్దరూతమ వృత్తలక్షణాల నిదే వృత్తాలలో చెప్పారు. ఇద్దరూ జయదేవ ఛందాన్ని కీర్తించారు రేచన తన ప్రాణ సమాన మిత్రుడు వాచకాభరణు డనే చెప్పాడు

ఇన్ని సామ్యము లుండటం వలన ఆ ప్రాణ సమాన మిత్రుడు నాగవర్మే యని నమ్మవచ్చు. నాగవర్మ తన ఛందోంబుధి రచన తరువాత తన మిత్రుడు రేచనకు కవిజనాశ్రయ రచనలో సహాయంచేసి ఉండవచ్చు.

'ని, శ్చలమతి మల్లియరేచన
సలలితముగఁ జెప్పు పూర్వశాస్త్రోక్త
విధన్'

అని రేచన చెప్పడంలోని పూర్వశాస్త్రాలు 'ఛందోంబుధి' కావచ్చు సంస్కృతమందలి 'జనాశ్రయఛందం' కావచ్చు, లేక మరేయితర, కాలగర్భంలో కలిసిపోయిన తెలుగు ఛందోగ్రంథాలైనా కావచ్చు. మనకు దొరుకుతోంది, పోలికలనుబట్టి దగ్గరైనదీ, ఛందోంబుధి కాబట్టి దానినే రేచన చెప్పిన పూర్వశాస్త్రంగా తీసుకుందాం.

వీటన్నిటినిబట్టి రేచన కనీసం పదకొండో శతాబ్దపు ప్రారంభదశలోనివాడై ఉండాలి.

ఇందుకు మరో ఆధార ముంది. నన్నెచోడుని గురువుగారు జంగమలింగమల్లికార్జునుడు అతడు పరవాదీంద్రఘనఘనానిలుడు. మల్లికార్జునుచేత ఓడింపబడిన వాదీంద్రుడు మల్లియరేచనకు గురువుగారు. కవిజనాశ్రయ గద్యనుబట్టి వాదీంద్రచూడామణి జంగమలింగనిచేత ఓడింపబడక పూర్వము రేచనకుగురువైఉంటాడు. అందువలన మల్లియరేచన నన్నెచోడుని కంటె పూర్వుడో సమకాలీనుడో అయి ఉండాలి. అనగా నన్నయకును కొంచెం ముందువాడో లేక సమకాలికుడో అయి ఉండాలి. తమిళ ఛందో గ్రంథమైన 'యాప్పిరుంగలమ్‌కారికై' అను దానిని బట్టి కూడా పైవిషయం స్పష్టమాతోంది. ఏదేమైనప్పటికి భారతరచనకు ముందే కవిజనాశ్రయరచన పూర్తయింది.

ఇక రేచన విషయానికి వద్దాం అతడు శ్రావకాభరణాంకుడు. అనగా ఉత్తమ శ్రావకు డనియే కదా!

'సచిత్తదవ్వవిగఈ, వాణవాతంబోల్
వత్థకుసుమేసు।
వాహన సయణ విలేవణ, బంభది
సిన్హాణ భత్తేసు॥'

అని శ్రావకనియమాలు పద్నాలుగు. ఉత్తమశ్రావకుడు పై నియమాలన్నీ పాటించి తీరాలి కాని రేచన సుందరీవశ్యవిద్యామణి, అనంగ సన్నిభాంగుడు, వారస్త్రీ సంసేవ్యవక్షుడు, కుచభారనమ్రవధూముఖాంభోజ భాస్కరుడు, ప్రహరణకళలడు, ఆనితారి, అగణితవైభవోపేతుడు, క్షతద్విడ్వంశావళి ఈ లక్షణాలను బట్టి తాను జినమతహితు డని, జినేంద్రపదభక్తి నిరతు డని చెప్పుకున్నప్పటికి రేచనమీద జైనమత ప్రభావం సడలిన దని చెప్పక తప్పదు.

దండక లక్షణంలోని 'పురారాతిమూర్తీ' అను సంబోధన వలనను, ఇంకను మిగిలినచోట్ల 'కుమారాభ', 'ఫాలాక్ష', 'భూతేశా' మొదలైన సంబోధలవలనను రేచన క్రమక్రమంగా శైవమతానికి దగ్గరైనట్లు కనపడుతోంది. కవిజనాశ్రయం పూర్తయ్యే నాటికి రేచనగురువైన వాదీంద్రచూడామణి జంగమలింగ మల్లికార్జునుని చేతిలో పరాజయం పొంది ఉండవచ్చు. అప్పుడు భీమనాగ్రసుతుడైన రేచన తిరిగి శైవమతావలంబి కాగోరుకోవడంలో విచిత్ర మేముంది।

ఇక్కడ రేచన తన్ను సంబోధించుకొన్న 'క్షతద్విడ్వంశావళి' అనే పదాన్ని కొంచెం పరిశీలించాలి. శ్రావకుల కు శత్రువు లెవరుంటారు ఉంటే పరమతస్థులేకదా! అనగా ఆ రోజుల్లో జైనులకు శత్రువులు శైవులు. జైన శైవమత పోరాటాల్లో రేచన పాల్గొని ఉంటాడు. మొదట్లో క్షతద్విట్టయినా తరువాత తరువాత శైవసంప్రదాయ ప్రభావితుడై ఉండొచ్చు.

గ్రంథాదిలోని

'పరగిన విమలయశోభా
సురచరితుఁడు భీమనాగ్రసుతుఁ
డఖిలకళా
పరిణతుఁ డయ్యును భూసుర
వర ప్రసాదోదిత ధ్రువ శ్రీయుతుఁడై'.

అను పద్యాన్నిబట్టి రేచన అఖిలకళా పరిణతు డయ్యును భూసురవరప్రసాదోదిత ధ్రువశ్రీయుతు డయ్యాడు గ్రంథాదిలో చెప్పిన పద్యాలన్నీ గ్రంథారంభవేళనే చెప్పాలని లేదుకదా! తనపై వైదిక ప్రభావం పడ్డాక బ్రాహ్మణులపై తన కేర్పడిన భక్తి నీవిధంగా తెలుపుకొంటాడు వణిగ్వంశ చూడామణి కదా మరి.

బ్రాహ్మణులు తక్క మరెవ్వరు కవిత్వం వ్రాయకూడదనుకొనే ఆరోజుల్లో రేచనమీద ఎన్నో ఒత్తిళ్ళు వచ్చి ఉండాలి.

జైనకవిగాకొంత, బ్రాహ్మణేతరుడుగా మరికొంత జైనమతం క్షీణిస్తున్న ఆ దశలో అప్పటి పండిత పరిషత్తులచే రేచన నిరసింపబడ్డాడు వీనిచేత సన్మానాలు పొంది కవిజనాశ్రయుడని పొగిడిన కవిలోకమే వీనిని కవిగా గుర్తించుట కంగీకరింపలేదు. అందుకే భూసురవరప్రసాదోజతధ్రువ శ్రీయుతుడ నని చెప్పకొని దాననీకిని ప్రయోగించాడు.

అయినా నాటి కవిమండలికి రేచనను కవిగా గుర్తించడం బాధగా పరిణమించి ఉండొచ్చు. శైవులతో నాడు జరిగిన తగాదాలలో నైతేనేమి, నాటి బ్రాహ్మణ్యపు నిరంకుశ ప్రవర్తన వల్లనైతేనేమి, రేచన చెప్పిన కృతులు నాశనమై ఉండవచ్చు కవిజనాశ్రయం లక్షణగ్రంథం కాబట్టి ఎవరో తిన్నతిండి మర్చిపోలేని బుద్ధిమంతుడొకడు జాగ్రత్తగా ఒక ప్రతిని దాచుకొని ఉండవచ్చు ఈ పరిస్థితులకు విసిగిన రేచనకు మానసిక క్షోభ ప్రాప్తించింది. అందులోనూ వయసు దానికతోడు కళత్రవియోగమూ సంప్రాప్తమై ఉంటాయి వీటన్నిటి ఫలితఁ సంఘంమీద ద్వేషంగా పరిణమించింది తన్ను దూరదూరంగా నెట్టిన వారి ఆట కట్టించాలనుకున్నాడు ఏదో చిట్కా ఆలోచించాడు. అందరూ నిరసించిన నిజ శ్రమాన్ని త్యజించాడు లోకం దృష్టిలో క్రొత్తవాడుగా ప్రవేశించాడు. కవ

నెత్తిరాపాడే రంపంగా అవతరించాడు.

ఇదే కాలంలో జన్మవృత్తాంతం అద్భుత గాథగా చెప్పబడేవాడు, త్ర్యక్ష వరప్రసాద కవితాఢ్యుడుగా కీర్తింపబడువాడు, సంఘంపై ధ్వజమెత్తి తిరిగిన వాడు ఒకడున్నాడు అతడే వేములవాడ భీమకవి

భీమకవి కాలనిర్ణయంలో అనేక మతాలున్నాయి ఈ విషయంలో శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యగారనేక విధాలుగా చర్చించి ఇతడు కవిత్రయం తరువాతివాడుగా నిర్ణయించారు. అందుకు వారు చూపిన ఉపపత్తులు తర్కానికి నిలిచేవిగా కనిపించడంలేదు.

ఆరుద్రగారు చర్చించిన అనేక ఆకరాలను బట్టి భీమకవి క్రీ శ 1100 ప్రాంతపువాడుగా నిర్ణయింపవచ్చు అనగా నన్నయగారికి కొంచెమించుమించువాడు రేచనకు వెనువెంటవాడు.

రేచనవలె భీమకవీ రసికుడే 'దక్షారామ పురీవిహారవర గంధర్వాప్సరో భామినీ వక్షోజద్వయ కుంభికుంభములపై వాసించు తద్వ్యాసనల్' మొదలుగా అతనిచాటువులే అందుకు నిదర్శనం.

కేతన తన దశకుమార చరిత్రలో తిక్కన తాతగారైన మంత్రి భాస్కరుని 'శాపానుగ్రహశక్తియుక్తుండమలాచారుండు' అని కీర్తిస్తాడు ఆ భాస్కర మంత్రి 11. వ. శతాబ్దివాడు 'శాపానుగ్రహపటువును రాపాడెడి కవులనెత్తి రంపంబనగా' వరలిన భీమకవి ఆకాలంలో ఉండవచ్చుననడానికి సందేహం లేదు.

అంతేకాక 'మూండుసేసిన గణములు ' అంటూ రేచన చేసిన అరసున్నల దగ్గర పూర్ణబిందు ప్రయోగప్రాసము 'మూండవ కంటితోడి ' అంటూ భీమన కూడ చేసాడు.

రేచన భూసురవరప్రసాదోదితధ్రువ శ్రీయుతుడు కాగా భీమన శంభువర ప్రసాద కవిసంఘవరేణ్యుడు.

రేచన కవిజనాశ్రయుడుకాగా భీమన కవులనెత్తి రాపాడెడిరంపము ఈ రెండు విషయాలలో విసిగిపోయిన రేచన చివరి దశకు, భీమనకు సంబంధ మున్నట్లే కనిపిస్తోంది

భీమన వయోవృద్ధు డనటానికి ఆధారమొకటుంది

'కస్తూరికాఘన సారాది సుగంధ వస్తువులు వేగందెచ్చి లాలింపురా' అని తెలుంగాధీశుని రాకొట్టాడంటే వయోవృద్ధుడు కానిదే సాధ్యం కాదుకదా!

మొత్తంమీద రేచన, భీమన ఒక్కరే అనుకుంటే రేచన పూర్తివయసు వంద సంవత్సరాలకు పైబడుతోంది. అప్పటివారు వందసంవత్సరాలు బ్రతకటం సామాన్యం కాబట్టి ఇదో పెద్ద విశేషం కాదు మనం చేసిన కాలనిర్ణయం కొంచెమటూయిటూ కూడ అయిఉండవచ్చు.

ఏదేమైనప్పటికి ఎందరో కవులు, మరెందరో లక్షణగ్రంథకర్తలు భీమకవిని కవిజనాశ్రయకర్తగ కీర్కొన్నప్పుడు మనమంత తేలిగ్గా త్రోసిరాజనటం తగదు. అక్కడేదో కారణ ముండక పోదు నిప్పులేనిదే పొగరాజదుకదా! మనకంటె ముందు వారికి వారిముందువారి విషయం ఎక్కువగా తెలియటాని కాస్కారముంది.

వీటన్నిటి కారణంగా భీమకవి తన పూర్వాశ్రమంలో మల్లియరేచన అయివుంటాడని భావిస్తున్నాను. ఈ విషయం కళ్ళారా చూచినవారో కథలుగా విన్నవారో కవిజనాశ్రయంలో కొన్నికొత్తలు కల్పించినా కల్పించి ఉండవచ్చు. మనకు లభిస్తున్న 'జ' వ్రాతప్రతిలో మనకు విశేషంగా కనిపిస్తున్న అవతారిక యీ విధంగా కల్పింపబడినదే కావచ్చు. అయితే అది కేవల కల్పనయి ఉండదు.

## ఉపయుక్త గ్రంథములు


1 వావిళ్ళ రామస్వామి శాస్త్రులుగారు ప్రకటించిన 'కవిజనాశ్రయం'. దానిక శ్రీ నిడదవోలు వేంకటరావుగారు వ్రాపిన పీఠిక 'తెనుగుభాషలో ఛందో లక్షణగ్రంథములు'

2. 'సమగ్రాంధ్ర సాహిత్యం-1' . ఆరుద్ర

3 'మల్లియరేచన' - శ్రీ గుమ్మా శంకర రావుగారి వ్యాసం. భారతి ఆగష్టు-1977

4. 'భాస్కరోదంతము' - కాశీభట్ల బ్రహ్మయ్యగారు.

5 'ఆంధ్రులచరిత్ర' - చిలుకూరి వీరభద్ర రావుగారు.

6 ఆంధ్రసాహిత్య పరిషత్తువారి 'కవిజనాశ్రయము, దానికి కీ. శే. శ్రీ జయంతి రామయ్య పంతులుగారి పీఠిక

7 Telugu Lıterature - P T Raju.

8 Hıstory of Telugu Lıterature - Srı G V Seethapathı

9 History of Kannada Lıterature - Srı R Narasımhacharya

10 Kanarıse Lıterature - Srı E. P Rıce.


— —

పాఠకులకు.

ప్రెస్సు పనివారి ఇబ్బందులవల్ల, అనివార్య కారణాలవల్ల 16-6 79 16 వ సంచిక సకాలములో ప్రచురింపలేకపోయినందుకు చింతిల్లుచున్నాము. 16 వ సంచికను ఈ సంచికతో కలిపి ప్రచురించడమైనది

సమాచారము తెలుపడమైనది.

— సంపాధకుడు

# శాకుంతలోత్తర రామచరితములు

— శ్రీమతి కుసుమ, ఎం. ఏ.

( 15 వ సూచిక తరువాయి )

పుత్ర గాఢపరిష్వంగములో దుష్యంతుడు, రాముడు అలౌకికానందాన్ని పొందుతారు. పుత్ర గాఢపరిష్వంగ సుఖానందము తలిదండ్రులకు స్వానుభవైక వేద్యము. 'ఆలక్ష్యదన్తముకులా ... ' భరతుని ఆలింగనం చేసికొనిన తనయుని చిలిపిచేష్టలను, అనిమిత్త హాసములను వీక్షించుచు, వాని ఒడలి మట్టితో మలినులైనట్టివారే ధన్యు' లని తలచుచూ, తన్మయుడౌతాడు.

లవుని కౌగిలించుకొన్న రాముడు కూడా ఇలాంటి అలౌకిక ఆనందాన్నే అనుభవిస్తాడు 'వ్యతిషజతి పదార్థానాంతరః కోఽపి హేతుః, న్నఖలు బహిరుపాధీన్ ప్రీతయస్సంశ్రయంతే ' అంతఃకరణము ఏదో ప్రాణులను సంఘటిల్ల జేస్తుంది. దానికి బహిరుపాధ్యాదులు కారణాలు కావని' భావిస్తాడు దీనినే 'పూర్వ జన్మభవ్యసుఖములు, మున్నెఱుంగకున్నను స్మరణకు వచ్చుటకు కారణము, రమ్యములైనవానిని చూచినప్పుడు మధుర శబ్దాలను వినినపుడును సుఖించుచున్నప్పటికీ మనస్సు ఉత్కంఠాభరితమగుటకు హేతువు_ 'భావస్థిరాణి జననాంతర సౌహృదాని' అని అనిపిస్తాడు కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసు.

దాశరథి దుష్యంతులు తమ పుత్రులను కలిసినది ఆశ్రమాలలో! దుష్యంతుడు సివంగిపిల్లతో ఆడే భరతుని మారీచాశ్రమంలో చూస్తాడు. సీతాపతి లవకుశులను వీక్షించినది వాల్మీకాశ్రమంలో.

నాయకునకు నాయిక వియోగపరిపీడిత ప్రతిబింబమై కనిపించినది 'వసనే పరిధూసరే వసానా, నియమక్షామముఖీ ధృతైకవేణిః అతినిష్కరుణస్య శుద్ధశీలా మమదీర్ఘం విరహవ్రతం బిభర్తి'॥ తన దీర్ఘవిరహవ్రతము రూపుదాల్చినట్లున్నదట శకుంతల! రసాతలమునుండి వెలికి వచ్చిన వైదేహిని తమస మురళ_ ఇలా వర్ణించినారు' పరిపాండు దుర్బలకపోల 'కిసలయమివముగ్ధం బంధనాద్విప్రలూనం ' 'తెలుపెక్కి దుర్బలమైన గండపాళితో జడవీడి కురులు ముఖముపై చెదరి కవి ('కరుణస్యమూర్తిరివ ) మూర్తి దాల్చిన కరుణవలె_' 'తొడిమనుండి త్రుంచిన కిసలయమువలె, హృదయ పుష్పము వాడగా దారుణగీష్మ_ శోకముచే దహించబడి పాలిపోయిన ఆమె శరీరము శరదూష్మ కేతకీగర్భ పత్రమువలె నున్నది.'

ఈ రీతిగా కథాపాత్ర చిత్రణాద్యనేక ముఖ్యవిషయాలలో రెండు నాటకాలకు అభేదము కనపడుచున్నది. ఇట్టి ప్రధాన సన్నివేశాలలోనే కాక ఇతర దృశ్యాలలో కూడ అభేదముకు రెండు నాటకాలు పొందినవి రెంటిలో నూ జలాలు (నదులు) ప్రాముఖ్యం వహించినవి. శాకుంతలంలో ఆమె ఉంగరము శచీతీర్థంలో జారిపోయినది_ ఫలితంగా కథ తల్లక్రిందులై, ఆమె తల్లడిల్లినది. భవభూతి రచనలో_ శ్రీరామచంద్రుని ఎడబాసిన జానకీదేవిని రఘుకులదేవత గంగానది తల్లివలె కాపాడుతుంది. భాగీరథి బాలకుల నిర్వరను వాల్మీకి మహర్షికి అప్పజెప్పి, అయోనిజను రసాతలమునకు గొంపోతుంది_ కడకు కుశలవ సహిత శ్రీరామభద్రుని ఆమె జలములనుండి వెలికి వచ్చి కలిసినది. అనాథయాధరణిజను కడుపులో నుంచుకొని కాపాడిన ఘనత భాగీరథిదే కదా!

మునిశిష్యుల భావపరంపరను ఇరువురూ ప్రతిభావంతంగా చిత్రించిరి 'ప్రశాంత ఆశ్రమ పదాలలో సంచరించే శార్ఙ్గరవ, శారద్వతులు దుష్యంతుని శకుంతలను అప్పజెప్పుటకు వెళ్ళి, జనాకీర్ణమౌ రాజధానిని చూచి 'ఇందలి జనులు మురికివారుగను, అపవిత్రులుగను, బద్ధులుగను,' ఉండిరని, 'స్నాతుడు కల్మషాంగునివలె' ఏవగించుకొనిరి 'ఆ ఊరు నిప్పు అంటిన ఊరివలె' వారికి తోచినది ఈ భావచిత్రణలో కాళిదాసు ప్రజ్ఞ నిరుపమానము. వారి ఇట్టి అభిప్రాయాలు తర్వాత ముగ్ధను తిరస్కరించిన రాజు ప్రవర్తనతో అగ్నికి ఆజ్యమువలె మరింతగా భగ్గుమన్నవి రాజును దూషించిరి ఇక ఉత్తర రామచరితమ్_లో చతుర్థాంకంలో తాపస శిష్యుల సంభాషణ మనోజ్ఞము. దాండాయన, సౌధాతకుల పలుకులు చమత్కారభరితములు. వశిష్ఠుడు అరుంధతితో దశరథ మహారాజ ధర్మదారలను వెంటబెట్టుకుని రాగా వారికి అతిథి సత్కారము చేయుటకు వాల్మీకి తన శిష్యులకు 'సెలవు' 'శాంక్షన్' చేశాడు దానితో సౌధాతకి ఆనందానికి అవధులు లేవు. ఆరోజు అనధ్యాయ కారణముచే పాఠములేని 'ఆటవిడుపు' రోజైనది అందుచేత 'ఆ ముసలి గడ్డాలకు స్వాగతము పలుకుచున్నాడట'! అతని హర్ష హేతువు అపూర్వమైనదే మరి!

అత్తవారింటికి సాగనంపునపుడు కణ్వ మహర్షి పుత్రికావియోగానికి తల్లడిల్లుతూ, సర్వసంగపరిత్యాగినైనా తనకే ఇంతటి ఖేదాన్ని కలిగిస్తే, గృహస్థులకు ఎంతటి దుఃఖాన్ని కలిగిస్తుందో ఆత్మజ వియోగము' అని విచారిస్తాడు. రామచరితమ్_లో జనకునికి అంతకంటె విలాపం సంభవిస్తుంది. కుమార్తె దుష్ప్రాప్తికి వగచుతాడు. తన జీర్ణదేహం రాలిపోవుటకు సాంతపనపరాకాది దుస్సహ కఠోర వ్రతాలను అవలంబిస్తాడు. మాంసాన్ని విసర్జించి వైఖానసవ్రతాన్ని పాటిస్తాడు.

జనకజ జన్మభాగధేయ మలా పరిణమించి నందుకు దురపిల్లుతాడు 'అరణ్యోద్వాసన నెట్లోర్చితివోఝి' అని శోకిస్తాడు తన వియ్యపురాలు కౌసల్య వచ్చినపుడు అతని అంతర్మథన విలాపదవాగ్ని అంతా వెలికి వచ్చిన సన్నివేశాన్ని భవభూతి అతి వాస్తవికంగా చిత్రించాడు

భరతునిక ఒక తాయెత్తును మారీచ మహర్షి కట్టినాడు. దానిని అతని జనకుడు తప్ప ఒరులు తాకరాదు, తాకినచో వారు భస్మమగుదురు తుదకు దుష్యంతుడు క్రిందపడిన తాయెత్తును తీసి కుమారుని చేతికి కట్టబూనుతాడు అది చూచి మునికన్యలు ఆశ్చర్య పోతారు. క్షేమంగా వున్న ఆ చక్రవర్తియే భరతుని తండ్రియనే భావం వారిలో పొడసూపుతుంది ఈ ఘట్టానికీ రామచరితమ్‌లో కుశలవుల జృంభకాస్త్రాల ఘటనకూ కొంత పోలిక వున్నది చిత్రదర్శన వేళలో తనకు జృంభకాస్త్ర దేవతలు అనుగ్రహించిన సంగతిని వివరిస్తూ, 'సర్వథా నీసంతానమున సుస్థాపితములగు' నని అనుగ్రహిస్తాడు. ఏతత్ప్రభావముచే సమంత్ర జృంభకాస్త్ర దేవతలు లవకుశుల నావిష్కరించిరి చంద్రకేతువుపై లవుడు జృంభకాస్త్రమును ప్రయోగించినపుడు సుమంత్రాదులు, రామలక్ష్మణులు సందేహాస్పదులౌతారు. ఆ మహాస్త్ర సంప్రదాయం పరమపుణ్య పరిపాక వశమున మహాసిద్ధి ఏదో కారణముగా లవునికి సిద్ధించినదని సమాధానపడతాడు రాముడు. తుదకు వాల్మీకి వలన కుశలవులు తన పుత్రులే అని తెలిసి హర్షాతిరేక-ఆనందబాష్పములతో వారిని కౌగిలించుకుంటాడు

ఈ విధంగా కాళిదాస-భవభూతి విరచిత మహానాటకములలో కథా సన్నివేశాద్యనేక విషయాలు అతి సన్నిహితత్వమును కలిగి యున్నవి శాకుంతలము కథా సన్నివేశ సూత్రనిబంధిత పుష్పమాలిక, రామచరితమ్ము కరుణ రసప్లావిత మరంద లావిక ఒకరిది సన్నివేశచిత్రణా నైపుణ్య కాంచన భాండములో నవరసములు చిందులు వేసినదికాగా ఇంకొకరిది కరుణరసాప్లుతము తొణికిసలాడిన రూపక రచనము ఒకరిది సంఘటనా ప్రధాన దృక్పథము కాగా ఇంకొకరిది రసప్రధానదృక్పథమైనది వారి దారులు వేరైనా గమ్యంఒకటే! అదే లోకోత్తర జనైక హృదయాహ్లాదము ఇరువురూ వాగర్థాల అవినాభావ సంబంధాన్ని ఎరిగినవారే! సార్థక సాభిప్రాయపద, విశేషణాలవాడుకలో ఇరువురూ అందె వేసిన చేతులే! వారి పదవాక్య గముక బంధపు అందెలు సాహిత్య పాదాల నాటికీ, నేటికీ, రేపటికీ ఘల్లు ఘల్లుమంటూ సర్వజనుల మనోమందిరాల నర్తిస్తాయి.

— —

# స్త్రీల పాటలలో అప్పగింతలు

— శ్రీమతి శిష్టా లక్ష్మీనరసమ్మ, ఎం. ఏ.



జానపద వాఙ్మయమునందు స్త్రీల పాటలు ప్రత్యేకస్థాన మలంకరించినవి. సురల జన్మంబు, శూరుల జన్మంబు, ఏరుల జన్మంబు తెలిసికొనుట కష్టమైనట్లే ఈ పాటల జన్మంబుఁ గూర్చికూడ తెలిసికొనుట కష్టమైన పని ఈ పాటలు నన్నయకు పూర్వమే యుండి యుండవచ్చును. ప్రాఙ్నన్నయ యుగములో కొంత పద వాఙ్మయ ముండినటుల మనకు తెలియుచున్నది. వెన్నెల పదములు, తుమ్మెద పదములు, నివాళి పదములు, ప్రభాత పదములు, గొబ్బి పదములు, వాలేశు పదములు, మున్నగు నవెన్నియో ఆనాడు ప్రచారము నం దుండినట్లు మనకు శాసనములవలన తెలియుచున్నది అవియే క్రమముగా వివిధములగు మార్పుల నొంది నేటి వరకును జన సామాన్యమునందు జీవించి యున్నవి. రానురాను నాగరికత పెరిగి వ్యక్తులలో మార్పులు సంభవించిన పిదప ఇవి పల్లెటూరివారైన కొలదిమంది నోటి యందు మాత్రమే జీవించియున్నవి.

జానపద గేయములు పెక్కువిధములుగా నున్నవి. పౌరాణికములు, చారిత్రకములు, సాంఘికములు, మతపరమైనవి. వేదాంతపరమైనవి, శ్రామికులకొరకు రచింపబడినవి పెక్కులు గలవు, వీనియందు పౌరాణికములు, సాంఘికములు, మతసంబంధములు, వేదాంతప్రతిపాదకములునైనవి స్త్రీల కుపకరించునవి. స్త్రీల పాటలన్నియు వారి సాంఘిత జీవనవిధానమునకు ప్రతిబింబములై యున్నవి వారి ఆశలు, ఆశయములు పాటలయందే వ్యక్తము చేయబడుచుండును స్త్రీ తల్లిగాను, కూతురుగాను, అత్తగాను, కోడలుగాను, ఇల్లాలుగాను, తోబుట్టువుగాను, అమ్మమ్మగాను ప్రవర్తించుచు ఆయా స్థానములకు న్యాయము చేకూర్చుచుండును. ఆయా స్థానములలో నామెకు బరువు బాధ్యతలు, కర్తవ్యములు మున్నగున వన్నియు నీ పాటలలో వ్యక్తము చేయబడినవి.

స్త్రీలపాటలలో ప్రాముఖ్యము, ప్రాచుర్యము గలవి పెండ్లిపాటలు. పెండ్లికి ప్రముఖస్థాన మీయబడినది. మానవజీవితమునందు పెండ్లి ముఖ్యఘట్టము. దీనితోనే స్త్రీపురుషుల జీవితములు మలుపు తిరుగుచుండును పెండ్లిలో జరుగు వేడుకలన్నియు నొకయెత్తు, అప్పగింతలు ఒకయెత్తు మిగిలిన వేడుకలన్నిటియందును శృంగార హాస్యములు చిందులాడుచుండును. కాని అప్పగింతలు కరుణారసపూరితములై చూచువారి మనసులకు ఆర్ద్రమొనరించును.

వివాహానంతరము ఆడుబిడ్డను అత్తవారింటికి పంపుట యొకముఖ్యఘట్టము. ఇది

ఆడుబిడ్డ జీవితములో ప్రధానమైన మలుపు చిన్నతనము నుండియు ఆమె మాటకు ఎదురులేక పోవచ్చును ఆమె ఆడినది ఆటయు, పాడినది పాటయు కావచ్చును. కాని పెండ్లియై మరియొకరి యింటికి పోయిన పిదప ఆమె ఆగడములన్నియు సాగవుకదా ఆమె తన అలవాట్లలో కొన్నిటిని మార్చుకొనవలసివచ్చును ఒక యింటికి, మరియొక యింటికి ఆచారవ్యవహారములలో భేదములుండును తన అలవాట్లను మార్చుకొనక పోయినట్లైన, ఆమె జీవితము ఒడుదొడుకులు లేక నడువదు ఇవన్నియు గుర్తించియే తల్లిదండ్రులు తమబిడ్డలను అత్తవారింటికి పంపు సమయమునందు జాగరూకతకై వారికి హితోపదేశమును చేయుదురు. అత్తవారింటియందేవిధముగ మెలగవలయునో, అత్తమామలు, ఆడుబిడ్డలవద్ద నెవిధముగ నుండవలెనో వివరముగా తెలియజేయుదురు. కుమార్తె ప్రవర్తనలో నేమైన లోపములున్నవో వానిని సరిదిద్దవలసిన బాధ్యత తల్లిదే. లేనిచో వియ్యపురాలును, ఇరుగుపొరుగు వారును ఆమె పెంపకము నధిక్షేపింతురు. అందులకే ఆమె కుమార్తె ప్రవర్తనపట్ల జాగరూకత వహించుచుండును. ఈహితబోధ నామె గ్రహించి సక్రమముగా ప్రవర్తించినయెడల నామె జీవితములో స్వర్గసౌఖ్యములను పొందును లేనిచో అత్త, ఆడుబిడ్డల సూటిపోటీ మాటలతో, ఇరుగుపొరుగు వారి హేళనతో కూడి యామె జీవితము నరకప్రాయ మగును

అప్పగింతపాటలలో పెక్కు సీత పరముగా చెప్పబడినవి లక్ష్మీదేవిపరముగను, కామేశ్వరిదేవి పరముగాను చెప్పబడినవి కూడకలవు మనభావములను, ఆచారవ్యవహారములను రామునకో, కృష్ణునకో సంబంధించినవిగ తెలుపుట మనసంప్రదాయము అంతటి గొప్పవారు, పౌరాణికవ్యక్తులే ఈవిధముగా ప్రవర్తించినయెడల సామాన్యజనులు మరింత జాగరూకత కలిగి ప్రవర్తింపవలయునని సామాన్యులు తమ ప్రవర్తనపట్ల జాగరూకత వహించుచుందురు ఈ పాటలన్నియు సామాన్యజనుల నుద్దేశించియు వ్రాయబడినవి జానపదుల యిష్టదైవము సీతమ్మ సీత దేవి చాల ఓర్పుగలది జీవితములోని కష్టసుఖముల నన్నిటిని సమముగ భరించినది తమ కుమార్తె కూడ సీతవలెనే సహనముకలదియై జీవితమునందలి ఒడుదొడుకుల నెదుర్కొనుచు సుఖజీవనము సాగింపవలయునని తల్లి కోరుకొనును కావుననే వారు తమ జీవితములోని కష్టసుఖములను సీతమ్మ పేరుమీదుగా వెలువరించిరి

అప్పగింతలు కరుణారసపూరితములైనవి తొమ్మిదినెలలు మోసి కని పెంచిన తల్లిదండ్రులకు తమ కుమార్తెను అత్తవారింటికి పంపుట బాధాకరమైనవిషయమే అయినను తప్పదు. అందులకే యామె భావిజీవితములో నేవిధముగా మెలగవలయునో విపులముగా వివరించి తమ కుమార్తెను అత్త మామలకు, ఆడుబిడ్డలకు, భర్తకు అప్పగించెదరు బిడ్డలు ఎంత పెద్దవారైనను, తల్లిదండ్రుల దృష్టిలో వారు చిన్నపిల్లలే. సీత అప్పగింతలు అను పాటయందు ఈ విషయము చక్కగా విశదము చేయబడినది. సీత తల్లి సీతను 'ఎడ చంటి బిడ్డ నన్నెడబాయదమ్మ' అని అంటుంది పాటయందు సీత చిన్నదే కాని ఎడచంటి బిడ్డ మాత్రము కాదు సీతయందామెకు గల మమకారమే ఆవిధముగా పలికించినది

సీతను అత్తయగు కౌసల్యకు అప్పగించుచు సీత తల్లి కన్నీరు నింపుతుంది.

కౌసల్య చేతిలో చెయి నొప్పగించి
అవనిజ భారమ్ము మీ భారమనియె
నీకు తమ్ముని పట్టి నిజము సుమ్ము వదిన

అష్టవర్షములు పెంచి ఈ సీతను మీ కప్పగించుచున్నాను. ఇకనుండి ఈమె మంచి చెడు లన్నియు మీవిగాభావించి ఈమెను రక్షింపుమని కోరుచున్నది నీకు తమ్ముని పట్టి నిజముసుమ్ము వదిన యని సీత నీకు మేనకోడలు వంటిదని తెలియజేయుచున్నది. స్త్రీలకు మేనరికమనిన ప్రీతి మెండు తన అన్నకుమార్తెను గాని, తమ్ముని కుమార్తెను గాని తన కుమారునకు పెండ్లి చేయవలయునని ఆమె కుతూహలపడుచుండును మేనకోడలియెడ నామెకు సహజముగనే ప్రేమానురాగము లుండును ఆమె ప్రవర్తనము సరిదిద్దుచు తన కుమార్తెవలె భావించి మంచి చెడుల నారయుచుండును కావుననే సీతతల్లి సీతను నీ తమ్ముని పట్టి వలెనే భావించుచుండుమని కౌసల్యతో పల్కినది ఈవిధముగ పలుకుటలో నామె లోకానుభవము వ్యక్తము చేయబడినది

సీత చిన్నదనియు పను లేమియు నేర్వలేదనియు, నేర్పుగా తీర్చిదిద్దుకొనుమనియు కౌసల్యను కోరుతుంది,

నెయికాచ నేరదు నెలతసుమి వదిన
నేర్పుతో పనులెల్లా నేరుపావమ్మా
చల్ల చేయ నేరదు సఖియసుమి వదిన
మీ బాలలతోను నొక్క బాలగా చూడు
బుద్ధు లెరుగదు మంకుబుద్ధులే గాని
బుద్ధి వచ్చినదాక దిద్దుకోవమ్మా

అని పల్కుచు కన్నీరు నించినది. ఈ సమయమున తాను మహారాణి యను మాటనే మరచి సామాన్యురాలివలె దుఃఖించినది ఇచ్చట నామె మహారాణికాదు బిడ్డను అత్తవారింటికి పంపు తల్లి మాత్రమే కావుననే ఆమె ఆవిధముగా దుఃఖింపగలిగినది. నేయికాచుట, చల్లచేయుట, మొదలగునవన్నియు సామాన్యుల గృహకృత్యములు వీని నన్నిటిని సీత నిర్వర్తింప నవసరములేదు ఆమె మహారాణికదా. ఆమె దాసీజనము చేసేపనులన్నియు, చేయించుకొనును కాని ఈ పాటను రచించిన వారు సామాన్యులు వారి గృహకృత్యములును, ఆచారవ్యవహారములును వీనిలో వివరింపబడినవి. మహాసాధ్వియగు సీత పరముగా చెప్పబడినయెడల నవి

సూటిగా హృదయమునకు హత్తుకొని జనులందరను పాటింతు రను ఉద్దేశముతో చెప్పబడినవి.

ఆకలెరిగి అన్నంబు పెట్టినదాక
అడుగ నేరదు నీవు అడిగి పెట్టుము.

అనుచు వ్యథ నొందినది. బిడ్డ ఆకలి తల్లికే తెలియును. మిగిలినవారికి తెలియదు. కావున నీవు తల్లివలె ఆకలెరిగి అన్నము పెట్టుమా యని ప్రార్థించుచున్నది.

మా బాల కాదుసుమి మీ బాలసుమ్మి
మా బాల మీ బాలగా చూడవలెను

సీతను మీ పిల్లతో సరిగా చూడుము, నీకు అప్పగించిన తరువాత మీ బాలయే గాని మా బాల కాదుసుమా యని, అడువారిని కన్న యలసంతెనమ్మా యని కన్నీరు జలజల రాల దీనయై విన్నవించుచున్నది. ఈ సన్నివేశ మంతయు కరుణ రసపూరితమై ఏ సంబంధమును లేనివారలకు కూడ కన్నులనీరు తెప్పించుచుండును. దీనియందు తల్లికి బిడ్డలపై గల మమతానురాగములు విశదీకరింపబడినవి. శిష్టకావ్యములలో నెచ్చటను ఈ ఘట్టము రచింపబడలేదు, శిష్టకావ్యము లన్నియు పెండ్లితోనే సమాప్తమగును. కాని జానపద గేయములు పెండ్లినుండియే ప్రారంభ మగును. కనుకనే వివిధములగు ఘట్టములు వీనియందు వివరింపబడినవి. మన ప్రాచీనకావ్యములలో కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలము నందును, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శృంగార శాకుంతలము నందును అప్పగింతల ఘట్టము వివరింపబడినది, అభిజ్ఞాన శాకుంతలమునందు కణ్వుడు జితేంద్రియుడైనను, పెంచిన కుమార్తెయైన శకుంతలను అత్తవారింటికి పంపుచు కన్నులనీరు నింపినాడు. మహర్షియైనను కుమార్తె అత్తవారింట మెలగవలసిన విధమును వివరించుచు బుద్ధులు గఱపినాడు. సర్వసంగ పరిత్యాగియైన కణ్వమహర్షియే కుమార్తె నత్తవారింటికి పంపుచు దుఃఖించినయెడల [illegible] మాట చెప్పవలెనా? ప్రాకృత [illegible] వనే సీత తల్లి ఆవిధము [illegible] చినది.

'ఎలనాగ మీబిడ్డకేమి కొదువమ్మా
మీసీత మాశాంతి సమముగా నుండు'

అని కౌసల్యాదేవి సీత తల్లిని ఊరడించినది. కౌసల్య పలుకులచే నామె మనసులోని యారాటము కొంతతగ్గి దుఃఖ ముపశమించినది.

సీత అప్పగింతలపాట అను దానియందు సీత అప్పగింతల భారమును జనకుడే వహించినాడు. ఇచట జనకుని స్థితి కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలము లోని కణ్వుని స్థితివలె నున్నది. పెంచిన ప్రేమచేతనే వారు తమ బిడ్డలను విడువలేకున్నారు. ఇక కన్న తండ్రులమాట చెప్పవలయునా. ఈపాటలో జనకుడు సీతను కైకకు అప్పగించుచు పనులేమియు నేర్వనిదనియు, నేర్పుతో తీర్చిదిద్దుకొనుమనియు విన్నవించు చున్నాడు. సీతను కైకకు అప్పగించుటలో నొక అంతరార్థమున్నది. కైక శ్రీరాముని యెడ చిన్నతనము నుండియు ప్రేమానురాగములు కలదియై ఆతని తన బిడ్డగానే కౌసల్య కన్నను మిన్నయై తానే పెంచినదని లోకములో పెక్కు గాథలు ప్రచారములో నున్నవి. కావుననే కైకకు శ్రీరాముని యెడల ఏవిధముగా ప్రేమానురాగములు కలవో అదేవిధముగా శ్రీరాముని భార్యయైన సీతయెడకూడ నామెకు అధికారము, వాత్సల్యము నుండునని గ్రహించియే జనకుడు సీతను ముఖ్యముగ కైకకు అప్పగించినాడు. ఇది జనకుని వ్యవహార జ్ఞానమునకు చక్కని తార్కాణము.

'మాపట్టి కాదు సుమి మీపట్టిది సుమ్మీ
ఇది సీత ఇది శాంత సమముగా జూడు'

మని కైకను జనకుడు ప్రార్థించినాడు. ఆడుబిడ్డ యగు శాంతకు సీతను అప్పగించు సమయమున జనక రాజు కన్నీరు పెట్టెనని ఈపాట యందు కలదు. ఇచట జన[illegible] అనుభవము వ్యక్తమగు చున్నది. [illegible] ఆడుబిడ్డకు [illegible] పుట్టినింటి వ్యవహారములం[illegible]కారము ముందును. అదియును గాక ఆడబిడ్డ అర్ధమొగు డన్న వ్యవహారము లోకమున వ్యాపించి యున్నది. దీనిని దృష్టిలో నుంచుకొనియే జనకుడు శాంతమ్మ చేతిలో చెయ్యొప్పగించి కన్నీరు నింపినాడు. శాంతాదేవి–

'జనకుడా మీబిడ్డ కేమి కొదువయ్యా
అలరు పానుపుమీద అమరుండ గలదు'

అని జనకునకు అభయ మిచ్చినది. దీనితో జనకుడు కొంత తృప్తిచెందినాడు. అదియును గాక కౌసల్య శ్రీరాముడును సీత అలరుపానుపు మీద అమరుండ గలదని పలుకుటతో నా పితృహృదయము లోని ఆరాటము తగ్గి సంతృప్తిని పొందినది.

అప్పగింతల పాట లన్నియు నీవిధముగనే యుండును. తమబిడ్డ ఎన్నోనోముల ఫలమనియు, తల్లిదండ్రులచేతిలో అల్లిబిల్లిగ పెరిగిన దగుటచే పనులేమియు నేర్వనిదనియు, మీబిడ్డలలో నొక బిడ్డగా నెంచి కాపాడుమనియు పాలనుంచినను, నీట ముంచినను మీదే భారమనియు, దయతో కాపాడి రక్షింపుమనియు తల్లిదండ్రులు ఆబిడ్డ అత్తమామలను ప్రార్థించుచుండుట ప్రతిపాట యందును కానవగు అంశము.

ఆడుబిడ్డ అత్తవారింటియం దేవిధముగ మెలగవలయునో విపులము గావివరించుచు తల్లి కుమార్తెకు హితము నుపదేశించును. ఈ హితోపదేశము సీతాదేవి పరముగను, లక్ష్మీదేవిపరముగాను చెప్పబడినది. అయిననిది సామాన్యజనుల కుపకరించునదే. వారి కొరకే ఈ హితములన్నియు ఉపదేశింపబడినవి. ఈ నీత్యుపదేశము సార్వకాలికము, సార్వజనీనమునై విలసిల్లునది.

"భూమీశ్వరికన్న బుద్ధిగలిగుండు
అత్తమామలకెల్ల అడుగు దాటకుమీ
తలయెత్తి చూడకుమి తరుణి మగవార్ని
అంతఃపురమందు పతి యన్న మాట
ఎంతైన హితులకు ఎరిగింపకమ్మా
పతియె దైవముసుమ్మి సతులకు నెల్ల
విభుడు మన్నించె నేని విఱ్ఱవీగకుమీ
పలుమారు పల్లెత్తి నవ్వబోకమ్మా"

అని సీతాదేవికి తల్లి అత్తింట మెలగ వలసిన విధమును, అచట ఆమె నిర్వర్తింప వలసిన విధులను తెలియజేసినది. కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలము నందు కణ్వుడు శకుంతల కుపదేశించిన నీతులు గూడ నీవిధముగనే యున్నవి.

భూదేవికూడ సీతాదేవికి కొన్ని బుద్ధులు గరపినది.

"వాల్చున్న రెకళ్ళు దాటపోకమ్మ
పొద్దోయి పొరుగిళ్ళ కెళ్ళబోకమ్మ
సంద్లడితే సాకలీథి కెళ్ళబోకమ్మ
నట్టింట సిట్లూక తొక్కబోకమ్మ
వీథిలో నీకురులు ఇప్పబోకమ్మ
పదిమందిలో నీ పలువరుస నవ్వబోకమ్మ
నీ అత్తమామలకు మన్ననచెయ్యి
ఆడబడుచు శాంతమ్మ కెదురుగా వెళ్లు"

భూదేవిసీతకుపదేశించిన నీతులు సార్వకాలికములు సార్వజనీనములునై యొప్పుచున్నవి. వీథిలో నీ కురులు విప్పబోకమ్మ అనుటలో నొక అంతరార్థమున్నది. వీథిలో కురులు విప్పుట, మొదలగునవి దరిద్రతాహేతువులని పెద్దలు చెప్పుదురు. అదియునుగాక వీథిలో కురులు విప్పిన చూచువారికి జుగుప్సను అసహ్యమును కలిగించును. కావున వీథిలో కురులువిప్పుట మంచిదికాదందురు. పలువురితో కూడి యుండునపుడు పలువరుసకన్పించునటుల నవ్వుట మన్ననకాదు. నవ్వు నాలుగువిధముల చేటు. పదిమందిలోను పకపకమని నవ్వుటవలన నామెయెడల చూచువారికి చులకన భావమేర్పడును. కావున పదిమందిలో పలువరుస కన్పించునటుల నవ్వకూడదు. అత్తమామలకు మన్ననచేయుమనియు, ఆడపడుచు శాంతమ్మను గౌరవముతో నాదరింపుమనియు బుద్ధులు నేర్పినది. (సశేషము)

# ఆవేదన

– శ్రీ లోలభట్టు
శివరామ కృష్ణంరాజు



దోసంబున్ గమనించ బోవక కవి
స్తోమంబు లీనాడు తా
మాసన్ జెంది ధనార్జనంబున కెదో
యశ్లీలసాహిత్యమున్
వాసిన్ గూర్చుచు నున్నవారలు జుగు
ప్సాహేతువై వీనులన్
సీసంబున్ గరగించి పోయునటులన్
చేటున్ గడున్ గూర్చెడున్

విననగు చుండె నెల్లెడల
పేరిమి నిప్పుడు ముక్కు పచ్చలా
రని బుడుతల్ చెలంగి విన
రానివి పాటలు చిత్రసీమలన్
గనుగొని పాడుచున్నెడ, నొ
కండును దానిని మాన్పబూనడున్
మనమున నెంచ డట్టిడు ల
మాయిక లట్టివి పల్కకుండగన్.

క్షితిపైనన్ మతిమంతు లెంచగ యశ
శ్శ్రీ సంపదన్ పొందె భా
రతదేశం బది యార్ష ధర్మనిలయ
ప్రాంతమ్ముగా పేర్మి సం
తత ధర్మాచరణ ప్రవేశముగ పు
ణ్యస్థానమ ట్లిప్పు డా
ప్రతిపత్తిన్ కడలించబోకుడి యసం
బద్ధ ప్రలాపంబులన్.

సాహిత్యామృత భాండమందున కవి
స్వాముల్ కడున్ నీతులన్
స్వాహాజేయుచునున్నవారలు ధనా
శాబద్ధులై సుంతయే
నూహాపోహములన్ గణించక విసం
బోలార్చుచున్నారికన్
సాహిత్యంబున సక్రమప్రగతి నం
దన్ జెల్లు నవ్వారికిన్.

తెలుగున్ బాసకు వన్నెగెచ్చు కవితా
ధిష్ఠాత లత్యంతమున్
గలరానాడును నేడు గూడ నిటులన్
ద్రవ్యంబు నాశించి బూ
తులనున్ వ్రాయగ సాహసించెడి కవి
స్తోమంబు పెంపయ్యె, నా
కలుషల్ నేడిటు లాడునో అరయ న
గ్రాహ్యంబుగా నుండెడున్.

ములుకుల్ వోలెను పాట లీశ్రుతియుగం
బున్ సొచ్చు దేవాలయం
బులకున్ చెంతను పెండ్లి యయ్యెడుస్థలం
బుల్ దగ్గరన్ సాహితీ
నిలయస్తోమములందు నెందయిన
గానీ వెఱ్ఱిగా నీజనా
వళి యీదూషితవాఙ్మయంబున కిడున్
ప్రాముఖ్య మేహేతువో?

కవి రచయించ పాటలను
గాయకు డయ్యవి యెంచి పాడగా
నవు, నవిపుట్టహేతువగు
నాతడు, వ్రాయక యున్ననెట్టులు
ద్భవమగు? నవ్వి, యీ కవి వి
తానము దాని దలంచి జాతిగౌ
రవమును నిల్పునట్టుల క
రంబు మెలంగుట లెస్స యెంతయున్.

భాషాయోష ధరించన్
దూషితమయినట్టి యిట్టి తొడవులు మేనన్
ఘోషించుచుండెడిని అభి
లాషను నివి వ్రాయ కవికులమునకుదగునా?

ఏహ్యమగు నిట్టి వ్రాతలు
సహ్యంబౌనా! యెల్ల శ్రోతృజనములకు
గడున్
బాహ్య మగు నీతికివి కడు
వాహ్యములగుపాతకముల భావింపు డెదన్.



# కవిత్వంలో నవత్వం

— శ్రీ సోమసుందర్

మనః కార్మికశాలలో ఉత్పత్తయ్యే అక్షరబద్ధ కళాస్వరూపం సాహిత్యం. వ్యక్తి ప్రతిభాజన్యమైన ఈకళకు నవ్యత ప్రధాన జీవలక్షణం. నవ్యత అంటేనే నిన్నటివరకూ అస్తిత్వంలో లేనిదని అర్థము. ఈనవ అనేపదం సృజనాత్మక సాహితీకళా ప్రక్రియల స్వరూపస్వభావాలను మొత్తంగా పట్టియిస్తుంది. అంటే ఒక సమిష్టిజీవలక్షణ మని తేలుతుంది. పూర్వమున్న దానికి పూర్తిగావిలక్షణమైన వానినే సాహితీకళాజీవి సృజించవలసి ఉన్నది.

విలక్షణత్వం అన్నామని యిది విభిన్నతకో, విరుద్ధతకో పర్యాయపద మనుకోనక్కరలేదు. అంతవరకూ ఉన్నదానికి వైచిత్రీపరంగా క్రొత్తరేకుచేకూర్చి - జవజీవాలను ప్రోదిచేసేదిగా సాహితీ సృజనలో ఈ నవ్యత్వం ఆపాదిత మవుతూ వచ్చింది ఐతే గతానుగతికో లోకః అనుకొని కళ్లుమూసుకు సాగడం జీవలక్షణం కాదు; కాలపరీక్షకు నిలవడమూ కాదు.

ఉన్నదానికీ నవీనంగా సృజించబడుతోన్నదానికీ మనం కోరినా కోరకున్నా మాతాపుత్రసంబంధం ఉండేతీరుతుంది. ఈసత్యంఅంగీకరించినపుడు మనకు తెలియకుండానేసంప్రదాయప్రభావం కళాసృజనపైఎంతవుంటుందో తేటతెల్లమవుతుంది. సంప్రదాయాన్ని ఆలంబనంగా-సారవంతమయినభూతలంగా స్వీకరించి నవీనావకాశాలను అన్వేషిస్తూ ఏపుగాపెరగని ఏ కళాకారుడూ సృజన చేయలేడనికూడ స్పష్టపడుతుంది.

తనకాలం వరకూఅనుస్యూతంగా ప్రవర్తిల్లుతూవచ్చిన సంప్రదాయానికిఒకప్రతిభాశాలి పూర్తిగావిరుద్ధమైనది, విభిన్నమైనదీ,అత్యంతనవ్యత్వాస్పదమైనదీ సృజించడంయాదృచ్ఛికంగానూ సకృత్తుగానూ జరగవచ్చు. కాని అది సర్వేసర్వత్రా సాధారణం కాదు ఇట్టిదిఅసాధారణమైనప్పటికీకూడ ఆ నవీనసృజనకు నేపథ్యంగా జీవాన్ని కాపాడుతూ ప్రవహించే రక్తనిష్ఠమైన సంప్రదాయ బలమేదోఎక్కడిదో ఉండేతీరుతుంది. ఐతే ఆప్రతిభాశాలి సంప్రదాయాన్ని తనహృదయగతం చేసుకొన్నాడనీ, స్వీయముఖ కాంతుల్ని మాత్రం వెదజల్లాడనీ, మనం చెప్పుకోవచ్చు. దీనికి వ్యతిరేకంగా కేవల సంప్రదాయ బద్ధుడు పాతవాటికి ప్రతిబింబాలనూ ప్రతిధ్వనులనూ మాత్రమే సృష్టిస్తూ కాలంగడుపుతాడు. ఇలాంటిసంప్రదాయ శ్రోత్రియుడు నిజమైన సృజనశక్తికి అనర్థమే కలిగిస్తాడు.

ఈసమస్యను కూలంకషంగా చర్చించిన ఆధునికాంగ్ల కవి, విమర్శకుడు టి. ఎస్. ఎలియట్, ఇలా అంటాడు. Novelty is better than repitition' అని వర్తమానమానవునిలో అతని గతవంశీకుల నుంచి వారసత్వంగాసంక్రమించిన రక్తంలాగ, జీవలక్షణాలలాగ, ముఖాదిఆంగిక సాదృశ్యాలలాగ ఒకజాతి సంప్రదాయం ఆజాతిభాషలో అంతర్లీనమై వుంటుంది. ఆ జాతినుంచి పుట్టిన ప్రతిభాశాలి హృదయంలోని ఆంతరికశక్తివలెముందుకు నడుపుతుంది. కవికీ, కళాకారునికీసైతం యిది సహజమైనదే. ఆదే అతని నవ్యసృజనకు పోషకంగాఉంటుంది. అంతేతప్ప సంప్రదాయ మొకభారంగాతయారై అతనిప్రతిభను అణచివేస్తే అతడుసంప్రదాయజడుడై భిక్షువుగా మారిపోతాడు. యథాస్వరూప ప్రతిబింబాలను తయారు చేసుకొంటూ బ్రతుకుతాడు. కనుకనే ప్రతిభాశాలి అయిన కవికీ కళాకారునికీ దేశకాల పరిస్థితులననుసరించి పరిణామానికి చోదకశక్తిగాసహకరించే సంప్రదాయబలమేతన వారసత్వంగా స్వీకారయోగ్యమవుతుంది. మృతగతం వర్తమాన ముఖకాంతిపై తమోఆచ్ఛాదం కారాదు.

వర్తమానలోకవృత్తాన్ని గమనాన్ని అవగాహన చేసుకోగలిగే చారిత్రక దృష్టి నవనవోన్మేషశాలియగు వ్యక్తిప్రతిభకు ఉపాలంబం కాగలదన్నది స్పష్టమే! కనుకనే మళ్లీ టి ఎస్. ఎలియట్ మాటలనే మనంశిరోధార్యంగా స్వీకరించుకోవచ్చు. గతాన్ని గతదృష్టితో మాత్రమే పరిశీలించేవాడు శ్రోత్రియబుద్ధిజాడ్యానికి దిగజారుతాడు. వర్తమానదర్శనతో, సమకాలీన తాత్త్వికావగాహనతో సమీక్షించేవాడు మంచిచెడ్డల వేర్పాటును పూనుకోగలుగుతాడు. అన్న అతని సూక్తి ఎంతో సత్యం.

సృజనఅనేపదంలో నవ్యతఅనేభావార్థం నిబిడీభూతమైవుంది. ఉన్నదానికి ఉన్నట్లుగా నమూనాలు తయారుచేయడం సృజన అనిపించుకోదు. స్వరూపస్వభావాదులలో పూర్తిగా విలక్షణమైన దాన్నిరూపొందించడమే సృష్టి. మౌలిక సృజనలో బాధ్యత నిర్వర్తించే కవికీ కళాకారునికీ ప్రధానంగా అవసరమయ్యేది ప్రతిభ.వ్యుత్పన్నతయిటు ప్రతిభకు అటు సంప్రదాయజ్ఞతనుంచి తాను సేకరించుకోవలసిన వారసత్వానికీ వంతెనగాపుష్టిని చేకూరుస్తుంది

ఆధునికకాలంలో వ్యుత్పన్నతకు మన పూర్వులిచ్చిన పరిమితార్థం సరిపడదు.వర్తమానయుగంలో కాలదూరాలమధ్య గల అభ్యంతరం తొలగిపోయింది. ఆధునిక వైజ్ఞానిక శాస్త్ర విజయాలు విశాల విశ్వాన్ని ఒకే ఏకాండంగా (Single unit) మార్చాయి. ఆధునిక మానవుడు ఈ భూమండలంపై ఎక్కడ నివసిస్తున్నవాడైనా అంతర్జాతీయ మానవుడుగా రూపొందుతూ పురోగమిస్తున్నాడు. కనుకనే నేటిమేధావిహృదయానికి ఒకఅంతి

ర్జాతీయ మానవతా సంస్కృతి వారసత్వంగా సంక్రమిస్తోంది. ఈపరిణామం ఏమాత్రం వటాటోపం లేకుండానే జరిగిపోతోంది. రాత్రి దినంలోకిపరివర్తనచెందినంత సహజంగా.

నేటినాగరిక బుద్ధిజీవులకు అత్యంతావశ్యకమైన జ్ఞానభాండారం నిలువులోగాక అడ్డంలో పెరిగింది. నేటిసాహితీకళాకారుడు అనేక అంశాలనిగురించి స్థూలపరిజ్ఞానాన్ని ఆకళించుకోవాల్సిన అవసరం ఏర్పడింది. నేటి కవీ,రచయితా, కళాకారుడూ - అద్వైతంనుంచిఅణుశాస్త్రం వరకూ పరిమితిపరిజ్ఞానాన్నైనా అవగతం చేసుకోవలసివుంది. అసంఖ్యాక వైజ్ఞానిక విషయాలజ్ఞానం ఆధునిక మేధావి ఆలోచనా శ్రేణికిఆధారభూతంకాక తప్పడం లేదు. అయినాఅతని ప్రధానకేంద్రీకరణ కళాసాధన పట్లనే! కళాప్రదర్శనలో నైశిత్యాన్నీ నైపుణ్యాన్నీ అలవర్చుకుందుకే అతని సాధనసాగుతుంది. అట్టిసాధనలో స్వాధీనమయ్యే మెలకువ లన్నీ అతనికళాప్రతిభకు క్రొత్తకాంతిరేఖలుగా చేరుతో ఉంటాయి. తద్ద్వారాప్రతిభకు దోహదంచేస్తాయి. ఇతరేతర లోకజ్ఞానమంతా అతని వ్యుత్పన్నతాభాండారాన్ని పెంపొందించే సామగ్రిగా చేరుతుంది. అతని సంస్కారాన్ని పెంచుతుంది.

ప్రదర్శన కళాకారుల కింత మాత్రమే సరిపోదు. అభ్యాసం ఏకళకైనా నిత్యనైశిత్యాన్ని వెలార్చుతుంది. అనగనగ రాగమతిశయిల్లినట్లే - రాయగా రాయగా రాతలో రీతి ఏర్పడుతుంది. సంవిధాన చాతుర్యం పెంపొందుతుంది.సాధనంలేని గానకళ రాణించనట్లే - మథన, ధారణ అభ్యాసాలు లేని సాహిత్యకళా రాణించదు. కౌశలము హస్తలాఘవము వంటివి హస్తకళలకేకాక మనోమయ కళలకు సైతం బలవర్ధకాలే!

ఆధునిక కవికి లోకానుభవంతో పాటు - కావ్యానుశీలనం, విమర్శనాశక్తి శాస్త్రాధ్యయనం, అత్యవసరా లని మనం కొత్తగా చెప్పుకోవలసిన గొప్పమాట కాదు. ఆధునిక జీవన విధానాన్ని కలవరపరిచే వర్గసమాజాన్ని వైజ్ఞానిక శాస్త్రీయ గాహనతో రచయిత పరిశీలించాలి. సమస్తదేశాల సామాజిక జీవనవిధానాలనూ పరిణామాలనూ అవగతంచేసుకోవాలి. ఆర్థికరాజకీయపరిజ్ఞానం స్థూలంగానైనా లేకపోతే - సమాజంఏదిశగా నడుస్తున్నదో తెలియదు. ఆచరణలో మంచిచెడ్డల వేర్పాటు బొత్తిగాపొసగదు. ఇలా చెప్పుకుంటూపోతే మనకులభించే పిండితార్థంఏమంటే - ప్రాచీన అలంకారశాస్త్రవేత్తలు ప్రాచీన కవులకు విధించిన ప్రమాణంకన్న ఆధునిక ప్రమాణాలు విస్తృతమైన వనీ; ఆధునికకవీ, సాహిత్యపరుడూ మరింత బాధ్యతాయుతు డనీను. అతనియోచనారంగభూమి ఆవరణవిశాలమైంది. పైగాపూర్వకవుల కాధారభూతమైన శాస్త్రాధ్యయన పద్ధతి ఆధునికయుగంలో పూర్తిగా మారిపోయిందన్న చైతన్యం భూమికకాక తప్పడంలేదు.

'తంత్రావాపాలు తెలియని మంత్రీ, విభిన్నదేశ భాషలలో వెలువడుతున్న సాహిత్యంపరిశీలించినకవీభంగపడతారని' రాజశేఖరు డన్నాడు. నేటిమంత్రులకు కావలసిన సరంజామా, అర్హతకలిగించే సామగ్రీ ఏమిటో నాకు తెలియదు. కాని కవులవిషయంలో రాజశేఖరు డన్నది మాత్రం కాలదోషం పట్టనిసత్యమే.

సమకాలీన సాహితీపరులలో - సంప్రదాయవాదుల మనుకొనే పెద్దలూ కొందరున్నారు; ఉభయవర్గాలలోను, సమ్యక్ దృష్టిగలమాధ్యమికులూ ఉన్నారు. అనినిర్దిష్ట మార్గావలంబకులూ ఉన్నారు; వీరంతా ఎలాంటివారుగాని-విభిన్నదేశాల వర్తమానభాషా సాహిత్యాలనుపరిశీలించవలసిందే!

సమకాలీనస్పృహలేనిఏకవీ,కళాకారుడూ ఆపదవాచ్యతకు అర్హతపొందడు. కళాప్రతిభ మృగ్యమైనవాడు హస్తవాసిపై బలుపుతూ కవిత్వాది కళలను చేతిపరిశ్రమల స్థాయికిదిగజార్చుతాడు. ముఖ్యంగా కవులు - హృదయాలను కదిలించగలిగే ఆర్టిస్టులు కాలేరు. Craftsmen గా మారి భంగ్యతరంగా బ్రతుకుతారు.

పూర్వకాలంలో భాషాపండితులే కవులుగా కీర్తింపబడేవారు.తక్కినకలవారు ఎంతప్రతిభావంతులైనా - కుకవులుగా నిందితులయ్యేవారు. నేటికాలంలో పాండిత్యమూ, కవితాప్రతిభా వేరింటి కాపురాలు పెట్టుకున్నాయి కవులలో విద్వత్కవులుండవచ్చు గాని, విద్వాంసుడు కానంతమాత్రంలోనే కవిగాపరిగణింపబడలేని ముదనష్టపు ఏలుబడిగతించింది. అల్పప్రతికుక్షింభర పండితుడూ కవిగాగణుతికెక్కవలసిన దురదృష్టమూ గతించింది.

నవనవోన్మేషశాలినియగు కవితాసృజనశక్తికి ప్రాచీనకావ్యానుశీలనం పుష్టిని కలిగిస్తుందేతప్ప అదే ప్రాణపదార్థం కాలేదు. ప్రాచీనకావ్యానుశీలనం నవీన కవికి అత్యవసరం అని అనుకొనిస్తే మాత్రం - అవెనులు చాటు సూది బెజ్జం నుంచి ఏనుగుతే దూరిపోగలుగుతాయి.

నవీనకవిని దిగత్రొక్కి సంప్రదాయ మాధ్యపుడూబిలేలకు కైంకర్యం చేసే ప్రమాదం ఉంది. పాతకు తాకట్టుపడిపోవడం, సంప్రదాయ భీరువులుగా మారిపోవడం మనకు కొత్తగాదు.

కవికి భాషతో నిత్యనైమిత్తిక సంబంధం ఉన్నదన్నమాటనిర్వివాదమైనదే. కాని కేవలం భాషాసంపదతోనే ఒకడు ఉత్తమ కవితను సృష్టించగలడనేమాట మాత్రం సత్యంకాజాలదు కవికి భాష ఒక ముడిపదార్థమే తప్ప అదేసర్వస్వం కాదు. దారుశిల్పికి కొయ్యలా ఉపయోగపడుతుంది.

కవి తనచుట్టూగల జీవత్ భాషను ఎన్నుకొని తన భావనావిశేషముతో

దానిపై బీజావాపనచేసి సజీవకవితను సృష్టిస్తాడు. వర్తమానకవి - వర్తమాన సమాజికుల ఊహాపోహాలకు, మనోవైక్లబ్యాలకూ, ఆశలకూ, ఆశయాలకూ, స్వప్నాలకూ, నైరాశ్యాలకూ, ప్రతిబింబప్రాయమయిన కవితాఖండాలను సృష్టిస్తాడు. అప్పుడే ఆ కవితలో ఆ జాతి తన స్వప్నాలను ఎన్నుకోగలుగుతుంది. సామాజికుల భావాలుగాని, ముడిపదార్థమైన భాషగాని ఉత్తమ కవితను తాముగా సృష్టించజాలవు. కవి స్వీయప్రతిభతో మాత్రమే ఉత్తమ కవితా సృజన జరుగుతుంది. అట్టి ప్రతిభావంతుడైన కవి సృష్టించిన కవిత వెనుక ఒకజాతి జీవనాడి మ్రోగుతుంది. 'The experience of the man is behind that single voice of the poet' అన్న వర్జినియా వుల్ఫ్ కితాబుకు అర్థం కాగలుగుతుంది. ప్రాచీన సాహిత్యపు ఇసుకలో తలదూర్చి వెలికిరాలేని సంప్రదాయపునాది సమకాలీన ఊహాశాలిత్వానికి నోచుకోలేదు. ప్రాచీనసాహిత్యంనుంచి ఎంతో నేర్చుకోవాల్సింది ఉన్నదని శ్రద్ధాభక్తులతో అధ్యయనం చేయవూనుకొన్న సాహిత్య విద్యార్థి ప్రాచీనభావాల ఊబిలో దిగబడిపోయే ప్రమాదంనుంచి తప్పించుకోడానికి నిరంతరం జాగరూకుడై కృషి సల్పాలి. హేతువాద మొక్కటే ఈ జాగరూకతను కల్గిస్తూ ఉంటుంది.

ప్రాచీనసాహిత్యంలోని పదసముచ్చయ అంబారీలక్రింద ఆధునికుని ప్రతిభాన్విత భావుకత్వం క్రుంగిపోతే జరిగే మేలు ఏమీ ఉండదు. కనుక ఆధునిక సాహిత్య సృష్టికి దోహదంచేసే సంభారంమాత్రం ప్రాచీన కావ్యాలనుంచి లభించదనే మాట నిర్వివాదం. దీనికోసమై చెలామణిలోలేని పాతనాణేలను త్రవ్వి తలకెత్తుకోవడంవల్ల సిద్ధించే ఉపలబ్ధి ఏమీ ఉండదు!

నిన్నటివరకూ ప్రపంచములోనివాస్తవికతావాదరచయితలు, మేధావులూ National in content and international in form అనేది ఆధునిక సాహిత్య కళా సిద్ధాంతంగా విశ్వసించేవారు. రెండు ప్రపంచయుద్ధాల తర్వాత వైజ్ఞానిక పరిశోధనలు అపారమై ప్రపంచ స్వరూపాన్ని మార్చివేశాయి. ఈ శతాబ్ది ప్రారంభంలో ప్రవర్తిల్లిన మేధావుల ఆలోచనలకు అనుసంధానంగానే ఆధునిక యుగంలో కవిత్వాది కళలు తమ స్వరూప స్వభావాదులను సంతరించుకొంటూసాగుతున్నాయి. ద్వితీయప్రపంచ యుద్ధానంతరం ప్రపంచ స్వరూపం తారుమారైంది. అణుశక్తిని స్వాధీనం చేసుకోగలగడం, అంతరిక్షవీధులను సంకల్పవశం చేసుకోగలగడం, చంద్రమండలాన్ని అందిపుచ్చుకోవడం, మానవుని పాదముద్రలు బరపి, పరిశోధించగలగడం వంటి వానితో ప్రపంచం మరీ సన్నిహితమైంది. స్వభావ స్వరూపాలమధ్య ఉండే ఆంతరిక వైరుధ్యం కళాప్రక్రియల పరిమితిలో తొలగిపోయింది. ఫారమ్‌లోను కంటెంట్‌లోనూ అంతర్జాతీయ సమ్యక్ దర్శనం కొత్తశక్తిని సంఘటింపజేసింది. సంప్రదాయమందలి శృంఖలాలను పూర్తిగా విచ్ఛిన్నంచేసింది. తరంనుంచి తరానికి అందిపుచ్చుకునే జీవలక్షణమైన వారసత్వం మాత్రమే కళాప్రక్రియలలో స్వీకార్యమైంది. కనుకనే ఆధునికశాస్త్రవేత్త ఇంటర్నేషనల్ యిన్ కంటెంట్ అండ్ ఇంటర్నేషనల్ ఇన్ ఫారమ్' అనే అవగాహనాపరిధికి పెరుగుతున్నాడు.

(ఆకాశవాణి విశాఖ కేంద్రం వారి సౌజన్యంతో).



1. జాషువా కవిత్వంలో ప్రకృతితత్త్వం.
2. రాళ్ళపల్లివారి రచనా రామణీయకత.
3. జానపద విజ్ఞానము-జానపద సాహిత్యము.
4. ఋతుషట్కము.
5. శ్రీనాథుని సమాసపరిశీలన.
6. శ్రీశ్రీ కవిత్వంలో హాస్యం.
7. నవ్యకవితా యుగోదయశ్రీ-ఉదయశ్రీ.
8. సీతారాఘవ చరిత్ర మను నిరోష్ఠ్యరామాయణము.
9. పుంభావసరస్వతి - శ్రీ రాళ్ళపల్లి.
10. కవి విమర్శకుడూ-ఆధునిక సాహిత్యానికి రెండుకళ్లు.
11. ఆచార్య యస్వీ - అప్సరస.
12. ఇన్ ఖరాబ్ కవి ఇఖ్బాల్.
13. శాంతికోసం అన్వేషించిన కవి బైరాగి.
14. నవలా సాహిత్యము - శ్రీమతి రంగనాయకమ్మ.
15. కలియుగ భీముడు - కోడి రామమూర్తి.
16. ఏకపీరలో ప్రతీకలు - ఒక పరిశీలన.
17. ఆనందగజపతి - సమస్యాపూరణము.
18. మార్గపద్ధతి - ఆధునిక రచయితలు.

* పైరచనలు ప్రచురణకు అంగీకృతములై మాయొద్దనున్నవి. కాలక్రమేణ ప్రచురింపగలము. — సంపాదకుడు.

# మధ్యమాంబా గరీయసీ

- శ్రీ డా. అయ్యగారి నరసింహమూర్తి, ఎం ఏ., పిహెచ్. డి.

(15 వ సంచిక తరువాయి)

మంథర అఘటనఘటనాసమర్థ. పరేంగితజ్ఞ. కార్య పరిసమాప్తికై మఱియొక సమిధ నుపయోగించెను. ఇందామె చతురత వ్యక్తము కాగలదు.

"గతోదకే సేతుబంధో న కళ్యాణి విధీయతే, ఉత్తిష్ఠ కురు కల్యాణి రాజాన మను దర్శయ 9-54

మంగళకరురాలవగు ఓ కైకా నీరంతయు పాఱిపోయిన పిమ్మట సేతుబంధనమున ప్రయోజనమేమి? అట్లే రామాభిషేక మయిన పిమ్మట నీవు వరంబు కోరియు ప్రయోజనంబు లేదు. కావున నివు డీయుపయోగంబు లేనిమాటలం బ్రొద్దుపుచ్చఁదగదు. లెమ్ము, నే చెప్పినట్లు సేయుము. కోపగృహంబు నంది రాజువచ్చుట కెదురు చూచుచుండుము."

కైక మనసు పూర్తిగా మారిపోయినది. ఇక వేఱొకరువచ్చి యేమి వచించినను తెలిసికొనఁ దగినస్థితినుండి దూరమైనది. ఇక నేచేయ బోవుదాని కెదురుండ దను రీతిగా కుబ్జతో నీతీరున బల్కినది.

ఇహ వా మాం మృతాం కుబ్జే నృపా
యా వేదయిష్యసి రాఘవేతు వనంప్రాప్తే
భరతః ప్రాప్స్యతి క్షితిమ్ (9-85)

ఓ గూనిమంథరా! ఒక వేళ దశరథుడు నాకు వరంబుల నొసఁగక పోవు నేని యిచటనే నేను ప్రాణంబులు విడుతును గాని కార్యసిద్ధి నొందక జీవింపను అపుడు కైకేయి కోపగృహంబునఁ జచ్చినదని నీవు దశరథునకుఁ జెప్పఁగలవు. అట్లుగాదేని రాముడడవికిపోగా భరతుడు భూమికి రాజు కావలయును, ఈ రెంటిలో నొకటి యేదైన జరుగుట నిశ్చయము.

ఏష మే జీవితస్యాన్తో రామో య
దభిషిచ్యతే రామునకు మాత్రము పట్టాభిషేకము జరుగునేని నేను ప్రాణంబులను విడుతును, ఇది నిశ్చయము.

పట్టాభిషేక శుభసమయమున తన ప్రియకాంతను పిలుచుటకై యమితోత్సాహముతో దశరథుడు కైకమందిరమునకు వచ్చెను. ఆమె వాలకమును జూచి రామ పట్టాభిషేకము జరుగుచుండగా నారామ యారాటముతో నలుకఁజెంది యుండుట కులికిపడి పలుకరింపఁగా; నామెకు దుఃఖము పెల్లుబికినది. రాజును ముగ్ధులసతి విచారమునకు వివశుడై 'నీమనోరథమేమి' తప్పక నెరవేర్తు నని యనునయింపఁగాఁ బెల్లుబికిన యానందముతో రామునడవులకుఁ బంపుట- ఆపై నాకుమారు డగు భరతునకు రాజ్య పట్టము గట్టుట- ఇవి రెండును నామనోరథములు ఆడినమాట తప్పకుండగా నాకోర్కెల నీడేర్పవలె నని పలికినది.

రాజు తనంతతానై మనోభీష్టములను నెఱవేర్తు నన్నపుడు కైక వరద్వయ మడుగుటలో దోషముండునా? అదియును గాక నాడు చెప్పినట్లు అడిగిన వరమును బ్రసాదింపనిచో రాజు ఆడితప్పిన వాడగును. వసిష్ఠాది మహర్షులచే ముహూర్త నిర్ణయము చేయించి ఈనాడు రాము నడవులకు బంపిన అనృతదోషము వచ్చుటయే గాక పెద్దల నవమానపరచిన ట్లగును, ముందు నుయ్యి - వెనుకగొయ్యి యను నట్లు అసిధారా వ్రతమట్లు, శ్లేష్మములో బడిన మక్షికము మాడ్కి- చిక్కులలోఁబడిన రాజున కేమి చేయుటకును తోచక మూర్ఛచే మొదలు నఱికిన తరువువలె నేలఁగూలినాడు ఆమూర్ఛనుండి కొంతసేపటికి తెప్పరిల్లిన రాజునకు కైక-

భరతేనాత్మనా చాహం శపే తేమను
జాధిప,యథా నాన్యేన తుష్యేయ
మృతే రామ వివాసనాత్ (12-49)

దశరథమహారాజా! రాము నడవికి పంపుట తక్క మరేమిచేసినను నాకు సంతోషముగలుగ దని భరతుండును నా ప్రాణంబును సాక్షిగా ప్రమాణము చేయుచున్నాను,అనగా ఆమాటలు వినిన రాజు -

న హి కించి దయుక్తం వా విప్రియం
వా పురా మమ. అకరోస్త్వం విశాలాక్షి
తేన న శ్రద్ధధామ్యహమ్ (12-20)

కైకేయీ! ఇంతకు మున్నెన్నడు నీవయుక్తముగాని, అప్రియముగాని యాడియెఱుగవు. ఈనా డిట్లాడుట చూడ నివి నీ మాటలేనా? నమ్మజాలకున్నాను. అనెను.'ఇవి నీమాటలేనా?'యని మహారాజామెను ప్రశ్నించుటలో నామె సౌశీల్యము వెల్లడియగుచున్నది.

ఇక్ష్వాకూణాం కులే దేవి! సమ్ప్రాప్త
స్సుమహానయమ్, అనయో నయసమ్పన్నే
యత్ర తే వికృతామతిః (12-19)

నీవు పూర్వము మిగుల ధర్మబుద్ధి గలదానవు అట్టి నీ కిపుడు ఇట్టి విపరీత బుద్ధి గలిగినది. కావున నీయిక్ష్వాకు వంశమునకు గొప్ప యనర్థము సంభవించినది.

ఇంతటి ధర్మ బుద్ధిగల సతి సరసమున్నను పతియగు దశరథునికి వంకర తలంపులు పోలేదు. కుటిల బుద్ధులకు ఎన్నటికైనను కీడు సంభవించును. ఇది ప్రకృతి నైజము, ధృతరాష్ట్రుడితనికంటె ఘను డగుటచేతనే తన యెదుటనే తన వంశ నాశమును గాంచినాడు. కుక్కతోక వంకర తీయుట సాధ్యముగాని పనిగదా!

ఇక తండ్రి యాజ్ఞపై అడవులకు వెడలఁ గట్టిన శ్రీరామచంద్రుడు సైతము కైకను గూర్చి 'మధ్యమాంబా గరీయసీ'యని పలికినాడు.

మంత్రుఁడు రాముని తోడ్కొని పోవుటకు వచ్చిన తరుణమున రాముడు కైకను గూర్చి

సా ప్రహృష్టా మహారాజం హిత
కామానువర్తినీ జననీ చార్థకామా మే
కైకేయాధిపతే స్సుతా (16-17)

కైకేయి నాకుఁ దల్లియు, లోకంబునకు మేలుఁ గోరునదియు దశరథ మహారాజు ననువర్తించునదియు నగుటం జేసి సంతోషంబున నాకుఁ బట్టాభిషేకంబు కోరుము, అనెను.

శ్రీరాముడు లక్ష్మణునితో

కృతాంతస్త్వేవ సౌమిత్రే ద్రష్టవ్యో
మత్ప్రవాసనే, రాజ్యస్య చ వితీర్ణస్య
పునరేవ నివర్తనే (22-15)

లక్ష్మణుడా! నన్ను వనంబునకుఁ బంపుట యందును, నాకిచ్చిన రాజ్యము నాకు లభ్యము కాకుండుటయందును కైకేయి కారణము కాదు. ఇవి యన్నియు దైవము వలననే సంభవించినవని యెఱుంగునది.

కైకేయ్యాః ప్రతిపత్తిర్హి కథం
స్యాత్ మమ పీడనే, యది భావో నదైవో
ఽయం కృతాంత విహితో భవేత్
(22-16)

ఇపుడీ తల్లియగు కైకేయికిం గలిగిన యీ అభిప్రాయము దైవముచే గలిగినది కాదేని నాయందెప్పుడును మిక్కిలి వాత్సల్యము కలిగియుండునట్టి కైకేయికి నన్ను బాధింపవలయునను బుద్ధి యెట్లు కలుగును?

సోఽభిషేక నివృత్త్యర్థైః ప్రవా
సార్థైశ్చ దుర్వచైః, ఉగ్రైర్వాక్యైరహం
తస్యా నాన్యదైవాత్ సమర్థయే
(22-18)

నేనట్లు మొదటినుండియు నాబిడ యందలి వాత్సల్యము ననుభవించి యున్న వాడను గాన నట్టి కైకేయి యిపుడు నన్ను జూచి పట్టాభిషేకము విడిచి యరణ్యమునకుం బొమ్మని చెప్పరాని భయంకర వాక్యంబులాడుటచే దైవంబు దక్క మఱి యేదియు కారణంబుగా నిశ్చయింప నవకాశము లేదు కైకేయి స్వభావమే కారణమయినచో నింతకు మున్ను బహుకాలముగా నామెకు నాయందుఁ గలిగి యుండు వాత్సల్యాతిశయంబు పోవుటకు కారణము కానరాదు. కావున దైవమే యిట్లు సంభవింపఁ జేసినది. అట్లగుటం జేసి కైకేయిని నిందింపవలదు.

కథం ప్రకృతి సంపన్నా రాజపుత్రీ
తథాగుణా, బ్రూయాత్ సా ప్రాకృతేవ
స్త్రీ మత్పీడాం భర్తృసన్నిధౌ, నలక్ష్మ
ణాస్మిన్ ఖలు కర్మవిఘ్నే మాతా యవీయ
స్యతిశంకనీయా, నైవాభిపన్నా హి వద
త్యనిష్టం జానాసి దైవం చ తథా ప్రభా
వమ్ ( 22-19,30 )

రాజపుత్రియు లోకోత్తర గుణసంపన్నయు నగు కైక యితరావిష్టకాక స్వస్థచిత్తయే యైయున్నచో ప్రాకృత స్త్రీ వలె మగని సమక్షమున నాకు పీడాకరము లగునట్టి పలుకులు పలికి యుండదు. లక్ష్మణా! ఈ పట్టాభిషేకమునకు మాపిన తల్లియగు కైక మాత్రము నిమిత్తము కాదు. దైవావిష్టయై యట్టియనిష్టము లాడినది. దైవమెంత లేని కార్యములకైనను జాలును గదా!

ఇక రూపక చక్రవర్తియగు భాసుడు తన ప్రతిమానాటకమున మొదట తన తల్లిని దోషిణిగాఁ దలంపఁ జేసి తూలనాడించి ఆపై యథార్థమును దెలిసినట్లు భరతుని చే నిట్లనిపించుచున్నాడు.

"హన్త! త్రైలోక్య సాక్షిణ్యః ఖల్వేతే! దిష్ట్యానపరాద్ధాత్ర భవతీ! అంబ! యద్భ్రాతృ స్నేహసముత్పన్న మన్యునా మయా దూషితాఽత్ర భవతీ, తత్సర్వం మర్షయితవ్యం అంబ! అభివాదయే (6 వ యంకం)

అహో! మీరు ముల్లోకములకు సాక్షులు గదా! ఈ పూజ్యురాలు అపరాద్ధ కాదు. అమ్మా! సోదర స్నేహమువలనఁ గలిగిన కోపముతో పూజ్యురాలవగు నిన్ను నిందించితిని. అదంతయు క్షమార్హము."

ఇది యిట్లుండ కాళిదాసు శ్రీరామ వనవాసానంతరము కైకతో నిట్లనుచున్నాడు.

కృతాంజలిస్తత్ర యదమ్బ సత్యా
న్నాభ్రశ్యత స్వర్గఫలాద్గురుర్నః
తచ్చిన్త్యమానం సుకృతం తవేతి
జహార లజ్జాం భరతస్య మాతుః
(రఘు 14-16)

అక్కడ కైకేయికడకు వెళ్ళి చేతులం కట్టుకొని నిలిచి ఆమెతో నిట్లనుచున్నాడు. 'అమ్మా! మాతండ్రి స్వర్గగమన కారణమైన సత్యవచనము నుండి భ్రష్టుడు కాకపోవుట నీ పుణ్యము చేతనే' యని ఆమె లజ్జను దొలగింపఁ జేసినాడు. మఱియు

సర్వాసు మాతృష్వపి వత్సలత్వా
త్స నిర్విశేషప్రతిపత్తి రాసీత్ ।
షడానన్నాపీత పయోధరాసు నేతా చ
మూనామివ కృత్తికాసు (రఘు 14-22)

కుమారస్వామి తన యార్గురు తల్లులను ఆరు మోములతో చనుబ్రాలు సమానముగాఁ జూచుకొనునటులే రాముడును నందఱి తల్లులయెడల వాత్సల్యముగలవాడు గనుక సమానప్రతిపత్తి చూపినాడు.

ఈరీతిని ప్రాచీన మహాకవులందఱును కైక నిర్దోషిత్వమును వేనోళ్ళ నిరూపించుచుండ లోక మెందులకో కైక సవతి కొడుకు నడవులకుఁ బంపి భర్తను జంపిన నరరూప రాక్షసి యనియు, కుటిల యనియు దూషించుచున్నది.

దురాలోచనము లేక కొందఱు ప్రబుద్ధులు కొన్ని విషయములను విటతాటనము చేసి లోకమున ప్రచారము గావింతురు. అంధపరంపరగ లోకము దానిని

గ్రహించుచు. గతానుగతికో లోకః న లోకః పారమార్థికః అను రీతిని పండితులు గూడ నదేమార్గమున పయనించుట శోచనీయమైన విషయము.

దూరాలోచన చేసి చేసిన మంథర బోధలకు కైక లోనైనను ముని దంపతుల శాపహేతువుచే నీమె చేసిన కార్యము భగవత్ప్రేరితమే కాని యన్యము గాదని తెలియుచున్నది. ప్రకృతి సిద్ధముగ స్నిగ్ధ కోమల స్వభావయగు కైక శ్రీరాముని క్షేమమును సర్వదా, సర్వథా ఆంకాంక్షించినదే కాని తదన్యమును స్వప్నమందైనను దలంపలేదు. దైవగతి విపరీతమైనపు డెవ రేమి చేయగలరు?

ఒకరి భాగ్యమునకు వేఱొకరు కర్తలు గారు గదా! చేసుకున్న వారికి చేసుకున్నంత శివశివా! యనికదా లోకోక్తి. శ్రీరాముడు తన యోగము బాగుండమిచే వనవాసాయాసమునకుఁ బాల్పడినాడు.

ఆమూలాగ్రముగ కైక నడివడికను గమనించిన వారు తప్పక ఈమెను 'నిర్దోషిణి, యని 'సుశీల' యని కొనియాడుదురు. ఈవిషయమున భీరువులకు తప్ప పెరలకు సంశయింపఁబనియుండదు. (ఇందలి శ్లోకతాత్పర్యములు శ్రీ చదలవాడ సుందర రామశాస్త్రులు గారివి.)

—...—



# సాహిత్యము - సమకాలీన - ఇతివృత్తము

— శ్రీ మోపిదేవి కృష్ణస్వామి, ఎం. ఏ.

మన సాహిత్య ప్రపంచమున సమకాలీనమైన ఇతివృత్తములను ఆధారములనుగ చేసికొని రచనలు జరపినచో పది కాలములపాటు నిలబడుట కష్టమని ఒక అభిప్రాయము కలదు. మన సాహిత్యమున కాలపు తాకిడికి తట్టుకొని నిలబడిన రచనలలో ఎక్కువభాగము రామాయణ భారత భాగవతములు, పురాణములు మొదలైన వేదవాఙ్మయము నందలి కథాంశములనే ఆధారముగా చేసుకొని వ్రాయబడినవే అగుట పై అభిప్రాయ మేర్పడుటకు కొంత కారణము. అందువలననే ఇప్పటి వారిలో కూడ పౌరాణిక చారిత్రకేతివృత్తములపై మొగ్గు కనబడుచున్నది.

నిజమునకు రాముని కథ వాల్మీకికి సమకాలికమైన ఇతివృత్తము. భారతకథ వ్యాసునకు సమకాలీనమైన ఇతివృత్తము. సమకాలీనమైన ఇతివృత్తములను తీసికొని వారు మనకు మహేతిహాసములుగ మలచి యిచ్చినారు. మనము సమకాలీనమైన ఇతివృత్తమును తీసికొని అట్టి యితిహాసమును ఎందువలన నిర్మించలేక పోవుచున్నాము? వారెట్లు నిర్మింపగలిగినారు? అని మనని మనము సూటిగ ప్రశ్నించుకొనగలిగినచో తగిన సమాధానము దొరకగలదు. కథలు ఈనాడు జరిగినవైనను, ఆనాడు జరిగినవైనను మరి యేనాడు జరుగునవైనను ఆ కథలలో వర్తించు ధర్మములు ఒకేలాగున నుండును. అట్టి ధర్మములను దర్శించిన వాల్మీకి, వ్యాసులు తమ రచనలను సార్వకాలీనములను, సార్వజనీనములను చేసినారు. ఒక సన్నివేశము జరిగినపుడు అందలి సృష్టి ధర్మము, మానవ ప్రకృతి ధర్మము, లౌకిక ధర్మము, దర్శించి ఆ సన్నివేశమును రసవంతముగ వర్ణింపగలిగినచో అది తప్పక ఇతిహాసమగును.

రచయితలు రెండు విధములుగా నుందురు మొదటి తరగతి వారు తమ సంస్కారమును బట్టి ఇతివృత్తమును స్వీకరించి, కథాకథనము నందును, సన్నివేశ కల్పనము నందును, పాత్రపోషణము నందును తమతమ యిష్టానిష్టములను, రాగద్వేషములను ప్రతిఫలింపజేయుదురు. ఈతరగతివారి రచనలలో రచయితకు కనబడిన ప్రపంచ ముండును గాని వాస్తవిక ప్రపంచ ముండదు. అట్లుగాక లోకమున జరుగుచున్న సన్నివేశములలో వాల్మీకి వ్యాసులవలె లోకహితమునకు పనికివచ్చు సన్నివేశములను ఎన్నుకొని, తమతమ అభిప్రాయము లనునవి లేకుండ, ఆయా సన్నివేశము లందలి ధర్మస్వరూపము, సందేశము లోకమునకు వ్యక్తమగునట్లు రచన జరుపగల నిర్లిప్తులు, ఋషికల్పులు రెండవ తరగతికి చెందుదురు.

పై సత్యములను గమనించియే మన వారు "నానృషిః కురుతే కావ్యమ్" అనినారు. అనగా ఇష్టానిష్టములకు, రాగద్వేషములకు, అభిప్రాయములకు, అహంకారమునకు అతీతుడై నిజస్థితిని దర్శనమొంది, ఋషిస్థితిని పొందినవాడే పది కాలముల వారికి పనికివచ్చు పరమార్థమును బోధించునట్టి కావ్యమును ప్రసాదించగలడని భావము. ఋషిస్థితి ఎంతవరకు పొందగలిగిన అంతవరకు అతని రచన లోకమునకు వినియోగపడగలదు. రాగద్వేషములకు ఎంతగ లొంగిపోయిన అంతగ అతని రచన కాలప్రవాహమున కొట్టుకొని పోగలదు. అనగా ప్రజల స్మృతి పథమునుండి జారిపోవును. ఇది

మనకు కాలము నేర్పుచున్న పాఠము, కవితాశక్తి కలిగిన వాడు ఈపాఠమును ఒంట బట్టించుకొన గలిగిననాడు జరిగిన ఇతివృత్తమును తీసికొనినను, జరుగుచున్న ఇతివృత్తమును తీసికొనినను పదికాలముల పాటు ప్రజలకు చేయూతనిచ్చు రచనలను చేయగలడు.

రచయిత తన ఆలోచనా సరళిని, నమ్మకములను, సిద్ధాంతములను, ఆవేశములను, అభిమానవిషయములను లోకహితమను యజ్ఞమున సమిధలుగా వేల్చుటకు ఉద్యుక్తుడైనచో మమకారములను వీడి ఆసమిధలను సమర్పించుచు తనను తాను సమర్పణచేసి కొన్నచో ఆలోకహితమనెడి యజ్ఞవేదిక నుండి ఆవిర్భవించిన యజ్ఞపురుషుడు అనుగ్రహించునదే సత్యదర్శనము. అట్టి సత్యదర్శనమును స్వీకరించి రసమయముగ తగిన పాత్రతో లోకమునకు అందించువాడే ఋషియైనకవి. అట్టికవిరచన కల్పవృక్షము. అందుండి అన్ని కాలముల వారును, అన్ని దేశములవారును అడిగి పుచ్చుకొనవలసినది యుండును. పవిత్రమైన ఈ బాధ్యతను గుర్తించిన రచయిత అట్టి ఋషిత్వమునకై తన జీవితమును తపస్సుగా మలచుకొనును. సూర్యుడు తాను ఉదయించుచునే లోకములను వెలిగించునట్లు అట్టిరచయిత తాను వికసించుచునే లోకమును వికసింపజేయును. సూర్యుడు తానొకచోట నున్నట్లు కనబడుచున్నను లోకమంతటా వ్యాపించుచున్నట్లు అట్టిరచయిత ఒక దేహమున దర్శింపబడుచున్నను నిజమునకు అతడు మానవజాతియందు అంతర్యామియై వర్తించుచుండును.



# గ్రంథ సమాలోచన

## విమర్శవేదిక

[రచయిత : శ్రీ అద్దేపల్లి రామమోహన రావు; ప్రచురణ ప్రభాకర్ పబ్లికేషన్సు, ప్రతులకు :- ప్రభాకర్ పబ్లికేషన్సు; 52-4-6. చిక్కాలవారివీథి, జగన్నాథపురం; కాకినాడ. పుటలు .- సుమారు 150; వెల- రు 10-00 ]

శ్రీ అద్దేపల్లి రామమోహనరావు ప్రసిద్ధుడైన యువకవి. అభ్యుదయపథంలో గేయరచన సాగించగల వీరు సాంప్రదాయికమైనఛందః కవిత చెప్పడంలోకూడ సమర్థులు.

వీరు రచించిన 'విమర్శవేదిక' అనే ప్రస్తుత గ్రంథం ఆం. ప్ర. సాహిత్య ఎకాడమీ వారి సహాయంతో సహకారంతో ముద్రింపబడ్డది, ఇందులో ఉన్న పదకొండు విమర్శవ్యాసాలు, గురజాడ, దేవులపల్లి, చలం, నండూరి సుబ్బారావు, శ్రీశ్రీ, బాలగంగాధరతిలక్, కుందుర్తి అనే ఏడుగురు ఆధునిక కవుల రచనలను కేంద్రం చేసుకొని తీర్చిదిద్దబడ్డవి

ఈ అన్ని వ్యాసాల్లోనూ శ్రీ రామమోహనరావు గారు ఆయా కవుల గ్రంథ సముదాయాన్ని ఎంతక్షుణ్ణంగా అవగాహన చేసుకొన్నారు, ఎంత సునిశిత పరిశీలన చేసినదీ తేటతెల్లమవుతున్నది. పద్యం, గేయం, వచనగేయం, నాటకం అనే వివిధ రచనా ప్రక్రియలను, ఏఏ దృక్కోణాలతో విమర్శించవచ్చో వీరి వ్యాసాలు చదివితే బోధపడ్తుంది.

గురజాడవారి పూర్ణమ్మకథ, కృష్ణశాస్త్రిగారి ఊర్వశి, నండూరివారి ఎంకిపాటలు, శ్రీశ్రీగారి సుప్తాస్థికలు వగైరా తిలక్‌గారి అమృతం కురిసినరాత్రి మొదలైన రచనల వస్తువులు తెలియని ఆంధ్రసాహిత్యప్రియుడు లేడు. శ్రీ రామమోహన్‌రావులా సునిశితావగాహన చేసుకొన్న తెలుగు విమర్శకులు అరుదు.

గురజాడవారితో "తెలుగుసాహిత్యములో హేతువాదం ప్రవేశించింది; ఒక సామాజిక సందేశాన్ని ధ్వనిస్తూ కథను సమాజంకోసం రాయడమే గురజాడవారి నూతన దృక్పథం" వంటి సూత్రప్రాయమైన వాక్యాలను వీరు విశదీకరించినతీరు సరళంగా ఉన్నది.

కృష్ణశాస్త్రిగారి 'అన్వేషణము' అనే ఖండికను విమర్శిస్తూ "జగత్తు ప్రకృతిపురుషుల లీల" స్త్రీ ప్రకృతిలో ఒకభాగం, కృష్ణుడు పురుషుడు. ఈభావన యిక్కడి ప్రకృతివర్ణనవెనుక ప్రకాశించడం, కవి ఉద్దేశించిన ధ్వని" అని వ్రాసిన వాక్యములో ఈ విమర్శలకు సాంప్రదాయిక వేదాంత విషయ పరిభాషలపైగల అధికారం వ్యక్తం అవుతున్నది. గురజాడ "వారి హేతువాదాన్ని" కృష్ణశాస్త్రిగారి "తాత్త్విక చింతనను" సమానకోణముతో చూడగలిగిన వీరి విమర్శదృక్కు ప్రశంసింపదగింది. మంచి విమర్శకునకు ప్రధానంగా ఉండవలసిన సహృదయత వీరిలో పుష్కలంగా గోచరిస్తున్నది.

"యామినీ శిరోజదీప్త జ్వాలా కుసుమాలు తేజోతల్పంపైరాలి అదృశ్యమైనాయి"

అన్న చలంగారి వచనాలను విమర్శిస్తూ 'యామిని అజ్ఞానానికి సంకేతం. ఆ అజ్ఞానపు శిరస్సుమీద వెలిగే పూలు భోగాలు (అంటే అవి అజ్ఞానానికి అలంకారాలు.) అవి తేజస్సు తల్పంపై అంటే అజ్ఞానంలో రాలిపోయేటప్పటికి అదృశ్యమైపోయినా, ఇంక అజ్ఞానం లేదు. జ్ఞానమే ఒక వెలుగుగా మిగిలిపోతుంది." అని చెప్పిన రామమోహనరావుగారి తీర్పు బాగున్నది. ఇల్లాంటి సాంకేతిక విషయసూచనలు విమర్శకులు పలుతావుల్లో చేశారు.

శ్రీశ్రీ రచనల్లో ఉన్న ఊహా వైవిధ్యాన్ని ప్రదర్శించి, వారి నాటికలు, ఖడ్గసృష్టి వంటి రచనలు వీరు చక్కగా విమర్శించారు. శ్రీశ్రీ పదాల్లో "విప్లవ ధ్వని" ఉన్నదని, వీరు ధ్వనిగుచ్ఛానికి మరో ధ్వని జోడించారు. మహాప్రస్థానం, ఖడ్గసృష్టి కావ్యాలను తూచి "కొండకొమ్మనుండి ప్రళయవేగాన దూకే జలపాతం 'మహాప్రస్థానం' కాగా, నేలమీద నిర్భయంగా ప్రవహించే నది 'ఖడ్గసృష్టి' అనే వాక్యంతో వీరు ఆ రెండు గ్రంథాల అంతస్తత్వాన్ని అంతరువును అరటిపండొలిచి చేతిలో పెట్టినట్టు చెప్పగలిగారు.

"రాసేది రవ్యుష్ణగీతి
చేసేది పవ్య గ్రహేంతి"

అన్న శ్రీశ్రీ పద్యాల్లో "భాష మరీ తెచ్చిపెట్టుకున్నట్లుగా ఉంది" అని నిజాన్ని జంకకుండ శ్రీ రామమోహనరావు వ్యక్తంచేశారు. మంచిని మంచిగా కానిదాన్ని కానట్లుగా మోమోటపడకుండ చెప్పడమే సద్విమర్శ.

నండూరివారి ఎంకి జీవితతంలో ఉన్న సున్నితమైన హృదయ స్పందనను వీరు చక్కగా ప్రదర్శించారు.

ఇక కుందుర్తి వారి (భాగ్య) 'నగరంలో వాన'ను గూర్చి విమర్శిస్తూ నిదర్శన ప్రదర్శన కోసం వీరు ఎన్నుకొన్న వచన గేయ చరణాలన్నీ రసరమ్యాలైనవే. రెండస్తుల బస్సులు "పక్షాలు పోయినా - పాదాలు వచ్చి పర్వతాలు పారాడుతున్నట్లు పరుగెడుతున్న" వనీ, ధారలు కట్టి వర్షిస్తున్న వాన "ధారాశుద్ధితో చెపుతున్న ఆశుకవిత్వంలా ఉంది' అనీ కుందుర్తిగారు చేసిన వర్ణనలు శ్లాఘాపాత్రంగా ఉన్నాయి.

" అవసరం లేనప్పుడడిగితే అప్పులు సులువుగా లభించినట్లు అక్కరలేని నగరంలో కూడా పుష్కలంగా కురుస్తుంది." అనే వాక్యాన్ని ఉద్ధరించి, 'అప్పులు' అంటే 'నీరు' అని ఉండే శ్లేషార్థాన్ని విమర్శకులు చూపించడం కవి హృదయాన్ని వీరు సరిగా అర్థం చేసుకొన్నారు అనడానికి నిదర్శనం.

ఈ పదకొండు విమర్శ వ్యాస ఖండికల్లోను కవియైన రామమోహనరావు, ఆయా కవుల హృదయాలను ఆకళించుకొని కవితా సౌందర్యాలను పఠితల ముందు సాక్షాత్కరింప జేశారు. విమర్శ తీరు పక్షపాత రహితంగా, సహృదయతతో, నిర్దుష్టంగా ఈ గ్రంథంలో - అంతటా గోచరిస్తున్నది.

ఈ ప్రచురణతో శ్రీ అద్దేపల్లి రామమోహనరావు సమర్థుడైన విమర్శకుడు అని నిరూపించుకున్నారు.

— సుగుణారాధక

---

# మాతృవందన

- శ్రీ తంగుడిగె శ్రీధరరావు,
బి. ఏ., బి. ఒ. ఎల్.

శ్రీమన్మాతృ శరీరమంజులత రా
శీభూతచిచ్ఛక్తియై
భూమీమానవమానసాంగణములన్
బొల్పారి నైజంపుసత్
ప్రేమోత్కృష్టత జూపిపార్థివమునన్
దివ్యత్వమున్ నింపు నా
శ్రీమాతన్ హృది నిల్పి కొల్తు రసవాక్
వృత్త ప్రసూనంబులన్.

చల్లని చూపుఁజేర్చి, సుత
జాలముఁ జెంతకుజేర్చి, స్ఫూర్తిరా
జిల్లఁగ దార్చి, నవ్యత సృ
జించి యచేతనమున్ విదిర్చి, సం
ఫుల్లత గూర్చి, యెల్లరకు
పూర్ణశుభమ్ములొసంగు మాతృశ
శ్వల్లలితాంఘ్రి యుగ్మమును
భావనసేయుదు భక్తిమై హృదిన్

పరమంబై తనరారు నట్టిదయి,
సంపత్సారమై, తోరమై,
నిరతానంద వినిర్మలంబునయి, శ్రీ
స్నిగ్ధప్రదీప్తంబునై,
సరసంబై, బహుమూల్యమై, సదయమై
సాదృశ్యచైతన్యమై,
స్థిరమై యంతట నిండియున్న
జననీశ్రేష్ఠత్వమెంతున్ దమిన్.

